# పురూరవచక్రవర్తికథలు

గ్రంథకర్త:

యస్. యన్. శాస్త్రిగారు.



పబ్లిషర్:

కొండపల్లి వీరవెంకయ్యా,

శ్రీసత్యనారాయణ బుక్ డిపో,

రాజమహేంద్రవరము.

౦-12-0

1937

# పురూరవచక్రవర్తికథలు




గ్రంథకర్త:

యస్. యన్. శాస్త్రిగారు.





పబ్లిషర్సు:

కొండపల్లి వీరవెంకయ్య,

శ్రీ సత్యనారాయణ బుక్కుడిపో,

రాజమహేంద్రవరము.

మొదటి కూర్పు 1000 ప్రతులు.

రాజమహేంద్రవరము :

శ్రీ సత్యానంద ప్రెస్సునందు

ముద్రింపఁబడెను.

1937




[వెల **0—12—0**

ఓమ్

శ్రీ రా మా

# పురూరవచక్రవర్తికథలు.



## అవతారిక.



శ్రీవేదవ్యాసమహర్షి యొక్క ప్రియశిష్యుఁడయిన వైశంపాయనుఁడు జనమేజయ మహారాజుంగనుగొని యిట్లనెను. "ఓరాజేంద్రా! వినుము. పాండవులు, ధార్తరాష్ట్రుల కపటకృత్యంబులకు వచింపఁబడి, రాజ్యములు, సిరులు, సంపదలు మున్నగువానినెల్లఁ బోఁగొట్టుకొని యడవులపాలయి యిడుమలం బొందిరికదా!" వారేవురును గామ్యవనమునందు వనవాసక్లేశ మనుభవించుచున్న సమయమున శ్రీవ్యాసమహర్షి వారిని దర్శింపఁ బోయెను; ధర్మరాజా ఋషిచంద్రునిఁ దగు విధంబునఁ బూజించి యుచిత పీఠంబున నుపవిష్టుంగావించి, "మహాత్మా! తమపవిత్ర దర్శనంబుచే మా పాపంబులెల్లఁ బాసి పోయినవి; మేము పవిత్రుల మయితిమి; ఈకష్ట సాగరమునుండి తరించుటకుఁ దెప్ప మాకేదయినఁ జిక్కునో, చిక్కదో యని పరిపరి విధములఁ దలపోయుచున్నారము. స్వామీ! ఈ వనవాసదుఃఖ మెన్నటి కడుంగును; ఏపాపమెఱుంగని యమాయకులమగు మాకీ యిక్కట్టులేల కలుగవలయును; ఆనతిండు" అని దీనాననుండై, గద్గదస్వరంబునఁ బలుకఁగాఁ, త్రికాలజ్ఞుఁడగు వేదవ్యాసుఁడు మందహాసోచిత వదనారవిందుఁడగుచు యుధిష్ఠిరు నుద్దేశించి, "ధర్మనందనా! నీవు ప్రాజ్ఞుఁ

డవు. ధర్మవేత్తవు ; విద్యావయోవృద్ధులగు వారివలనను, దపోధనుల వలనను బెక్కుధర్మము లాలకించినవాఁడవు. అట్టిచో, పామరుని రీతిని వగతువేల ! ప్రాప్తలాభమునకు సంతోషించుటయు, రానున్న ముప్పునకు విచారించుటయు ధీమంతునకుఁ దగదు. మఱియుఁ గష్టసుఖములను సమభావముతోఁ గైకొనువాఁడే విజ్ఞులు. సంపద లలముకొన్నపుడభినవోత్పలమువలె సంతోషించుటయుఁ గష్టములు దాపరించినపుడు చంద్ర సంస్పర్శమున నుండు పద్మమువలె వాడియుండుటయుఁ బామరుల లక్షణములు, కాఁబట్టి యీ ప్రకృతావస్థను దలంచుకొని మాటిమాటికిని నీవు చింతింపఁబనిలేదు. విధివిధాన మెంతవారికేనిఁ గడవరానిది. సృష్టికర్తయగు బ్రహ్మ విధివశముచేతనే యశాశ్వతకార్యము లాచరించి యపఖ్యాతిం బొందుచున్నాఁడు. శ్రీమహావిష్ణుమూర్తి విధివశముననే యవతారములెత్తి క్రిందుమీఁదగుచున్నాఁడు ; సంహారకర్తయు, సర్వేశ్వరుండును నగు శంకరుఁడు విధివశముననే పుర్రెను గేలఁబూని బిచ్చమెత్తుకొనుచున్నాఁడు. త్రిమూర్తులీవిధముగా విధిత్రిప్పులకు లోనయి యున్నవారు ; సుఖమొదవినను, కష్టమొదవినను విధివశముననేయని గ్రహింపవలయును. కాలము తాఱుమాఱయి యుండఁగా మనయభీష్టములు నెఱవేఱవు ; మనమీ రహస్యమును గ్రహించి, మౌనముద్రను ధరించి, చిత్తము పరమాత్మయందర్పించి, యుండుటమేలు. వినుము. ఓధర్మరాజా ! అధార్తరాష్ట్రులు మత్సరజాడ్య హతబుద్ధులై మీ కెగ్గొనరించియున్నారు. వారితో మీరు యుద్ధము సేయఁదలంచితిరేని, దగిన సాధన సంపత్తిని ముందుగా సేకరించుకొనవలయును. కాఁబట్టి మీలో సార్థకనాముఁడగు విజయుఁడు భక్తవశంకరుండగు శంకరునిగుఱించి తపంబాచరింపవలయును. ఆలోకేశ్వరుని, బ్రసన్నునిఁజేసుకొని పాశుపతము నాఁబడు దివ్యాస్త్రమును బొందవలయును. ఆపాశుపతాస్త్రముతోఁ బదునాల్గు భువనములను

నిర్జింపవచ్చును ; మదాంధులగు రాక్షసులను దునుమాడవచ్చును. "
అనెను. అనఁగాఁ బ్రక్కనే నిలువఁబడియున్న యర్జునుండు వేద
వ్యాసమహర్షి యెదుటకువచ్చి, భక్తిపూర్వకముగాఁ జేతులుమోడ్చి,
" ఆర్యా ! భక్తవత్సలుండగు పరమశివుని యొద్దనున్న పాశుపతాస్త్ర
మును సంపాదింపవలయునన్న యాశ నాకుఁ జిరకాలమునుండియుఁ గలదు.
అయ్యది యీనాఁడు తమ యనుగ్రహమువలన ద్విగుణీకృతమయి
నది. ఆ శంకరుని మెప్పించుటకుఁ దపముసేయ నీక్షణంబె పయనముగా
నున్నాఁడను. ఇందులకుఁ దమరును నాయగ్రజుండును అనుమతింప
వలయును. అనెను. అందులకు వ్యాసమహర్షి సంతసించి యిట్లు మాఱు
వలికెను. " వత్సా ! అర్జునా ! పాశుపతాస్త్ర ప్రాప్తికీవొక్క
రుండవే యోగ్యుఁడవు ; నీవు తపము సేయఁబోవుట కేననుమతించు
చున్నాఁడను ; మీధర్మనందనుండు నంగీకరించుననియే నావిశ్వాసము.
కాఁబట్టి పవిత్రజలములఁ గృతాస్నానుఁడవై రమ్ము. ఈశ్వరాను
గ్రహ ప్రాప్తికర్హమయిన మంత్రరాజమొండు నీకుపదేశింతును. "
అర్జునుఁడు నిర్ఝరానందముతోఁ బరిశుద్ధజలముల స్నానముసేసి, కాషా
యాంబరములుదాల్చి, కమండలమును, దండమును గేలంబూని, రుద్ర
రాక్షపేరులు మెడయందుఁ గుదురుకొలిపి, వేదవ్యాసుని యొద్దకువచ్చి
వినయ వినమితగాత్రుడై నిలచెను. అప్పుడమ్మహనీయుఁడు ధనంజయు
నకు మంత్రోపదేశమొనరించి, యాశీస్సులొసంగెను. తరువాత ధర్మనం
దనుఁడును దమ్మునిఁ గౌఁగిలించుకొని, దీవించి, " సహోదరా ! అచిర
కాలములోనే మహేశ్వరానుగ్రహముఁబొంది మగిడి రమ్మనెను. ముని
కులోచిత వేషముతో ఫల్గునుండెల్లవారియొద్దను సెలవుపొంది తపం
బాచరించుటకుఁ దగిన దివ్యవనమున కరిగెను. ఆవెనుక వ్యాసమహర్షి
ధర్మజునవలోకించి, " ధర్మరాజా ! నీవు సహోదర వియోగమునకు
విచారింపకుము. ఆ సుపవిత్ర చరిత్రుఁడు భగవదనుగ్రహమునకుఁ
బాత్రుఁడై పరమాస్త్రలాభమునడసి మగిడి రాఁగలఁడు. నేను బోవు

చున్నాను; నీవు వ్యాకులపాటునుడిగి సుఖంబుండుము." అని నిజే చ్ఛంబోయెను. దివ్యవనముం జొచ్చినయర్జునుఁడు, వేఱుచింతలులేని చిత్తమునం దచంచలభక్తిని బాదుకొలిపి, పార్వతీవల్లభునిగూర్చి బహు ఘోరముగఁ దపముసేయఁగడంగెను; ఆపూతగాత్రుని తపోశక్తికిని, జితేంద్రియత్వమునకును, ఏకాగ్రచిత్తమునకును దివ్యులెల్లరును హర్షించిరి. కైలాసవాసుఁడుమాపతియు హెచ్చుగా మెచ్చుకొని, యర్జునునకు సాక్షాత్కరించెను. అర్జునుఁడు కనులుదెఱచి యిందుధరునిఁ గనుంగొని, పులకితగాత్రుఁడై, యమందానందమునఁ జేతులుమోడ్చి, "పాహిమాం శంభో! పాహిమాం! ఓఅహిరాజభూషణా! కైలాసవాసా! ప్రమథగణసేవితా! ఈవు సృష్టిస్థితిసంహారకర్తలగు త్రిమూర్తులను గలిగియున్నవాఁడవు; లోకరక్షణార్థము త్రిపురములను, దదధిపతులగు దుష్టదానవులనుజయించి, సంహరించినవాఁడవు. కాలకూటాగ్నిని గరళమం దునిచినవాఁడవు. దేవాదిదేవా! నీలీలలు బ్రహ్మాదులకున్సైతము దురవగాహములై యుండఁగా, వానిని నిర్వచించుట కేనెంతటివాఁడను; నీ ప్రభావమును వేయిజిహ్వలుగల యాదిశేషుఁడయినను వర్ణింపఁజాలఁడు. మానవమాత్రుఁడనగు నే నెంతవాఁడను. ప్రభూ! కృపాకరా! యక్ష కిన్నర గరుడ గంధర్వాది దేవజాతులకును, ఇంద్రాగ్నియమవరుణ ప్రభృతులయిన దిక్పతులకును దుర్లభంబయిన త్వదీయదర్శన భాగ్యము నాకు లభించినందులకు నేను నిరతిశయానంద సౌఖ్యము లనుభవించుచున్నాఁడను." అనెను. అనఁగా శంకరుఁడు మందహాసరోచిష్ణులు ముఖమండలమునఁ గ్రాలుచుండఁ బ్రసన్నభావమువ్యక్తమగుచుండ "నోధనంజయా! అక్షీణబలపరాక్రమోపేతుండవగు నీవు, ఉత్తమక్షత్రియుండవయ్యు నింద్రియనిగ్రహణ మొనరించి, అమరజన సంకీర్తనీయమగు మహోగ్ర తపంబాచరించి మాకరుణకుఁ బాత్రుఁడవైతివి. నిన్ను మెచ్చితిమి; సాక్షాత్కరించితిమి; వలసిన

వరము వేఁడుము. అనుగ్రహింతుము.” అని నుడివెను. అర్జునుండు పు
లకించి దంకురితహాసభాసుర ముఖారవిందుఁడై, చేతులు జోడించి,
“ఓ దేవాదిదేవా! ముల్లోకముల నవలీల జయింపఁగలుగు పాశు
పతాస్త్రంబు మీయొద్దనున్నది. అద్దాని ననుగ్రహింపుము.” అనెను.
“ఇచ్చితిని; గైకొమ్మ” ని శంభుఁ డర్జునునకుఁ బాశుపతాస్త్రమిచ్చి
యంతర్ధానమొందెను.

మహేశ్వరానుగ్రహమును దన్మూలమునఁ బాశుపతాస్త్ర
లాభంబును దనసూనుం డర్జునుండు బడయుటఁ దెలిసికొని దేవేంద్రుఁడు
తనవారితో నాతపోవనంబునకు వచ్చెను. అర్జునుఁడు భక్తియుక్తుఁడై
వారికెల్లరకుఁ బ్రణామములు గావించెను. అఖండలుం డాత్మభవుని
నరసి, “వత్సా! నీవు నాకంబునకు రావలయున” నెను. తండ్రి
మాటం గాదనలేక, నాకావలోకనోత్సుకంబినుమడింప నందుల కతఁ
డంగీకరించెను. పిమ్మట శచీకాంతుఁ డర్జునుని దివ్యవిమానారూఢునిఁ
జేసి, తనవారితోఁగూడ నమరావతి కరిగెను. అందుఁ జింతామణీ
భద్రపీఠమునఁ దానుగూర్చుండి, తన ప్రక్కనే యర్జునుని గూర్చుండఁ
బెట్టుకొని రంభాద్యప్సరసల నాట్యమును, ముక్కోటిదేవతల మ్రొక్కు
లను, సప్తమహర్షుల యాశీస్సులను అందికొనుచుండెను. అర్జునుండును
నాఖండలుని గద్దియఁ గూర్చుండు మహాభాగ్యమబ్బినందులఁ కెంతయు
ప్రమోదమునుజెంది, తనచరిత్రమును, ధైర్యస్థైర్యశౌర్యగాంభీర్యా
దులను దన తండ్రివలన విన్న దివ్యప్రముఖులతోఁ బరిచయము
గల్పించుకొని యుండెను. తరువాత నింద్రుఁడు కుమారునుద్దేశించి,
“వత్సా! నీవలన మాకుఁ గావలసిన మహోపకారమొండున్నది.
అద్దానిని నీవు దీర్పవలయున” నెను. “దేవా! నేను మీభృత్యుఁ
డను; మీయాజ్ఞకుఁ గట్టుఁనడియుండువాఁడను. అట్టిచే నావలన నుప

కారము కావలసియున్న నయ్యది నామహాభాగ్యమేయగునుగదా! సందేహముడిగి యానతిండు". అని యర్జునుండు దేవేంద్రునకు మాటలువలుకఁగా నాతఁడు సంతోషించి, "కుమారా! నివాతకవచు లనువారు రక్కసులు; వారు మదాంధులై త్రిలోకములను హింసించు చున్నారు. వారిని నీవు నీపాశుపతాస్త్రముతో జయింపవలయును. అకార్యము మాకు దుస్సాధ్యము. నీవు తడయవలదు. వెంటనే నెఱ వేర్పవలయును." అనెను. అర్జునుండు మహోత్సాహముతో వానికడ సెలవుపొంది యాశీస్సులందుకొని వెంటనే బయలుదేఱిపోయి, సముద్ర మధ్యమునం దడఁగియున్న నివాతకవచులను రాక్షసులను, జయభేరి మ్రోగించి యాహవంబునకుఁ బిలిచి, వారితోఁ దద్దయుం బెద్దప్రొద్దు బహుఘోరముగఁ బోరి వారినోడించి, పరిమార్చి జయజయధ్వాన ములతో నమరపురిం బ్రవేశించెను. ఇంద్రుఁడు మున్నగువారందఱును అర్జునుని శక్తిసామర్థ్యములను శ్లాఘించిరి. "వత్సా! అర్జునా! మందాకినీ నదీజలంబుల స్నానముసేయుచుఁ దత్తీరమున వెన్నెలరాత్రు లలోఁ గ్రీడించుచుఁ గామధేనువొసంగు షడ్రసోపేతభక్ష్యంబు లార గించుచుఁ బారిజాతప్రసూనముల నాఘ్రాణించుచు, రంభాద్యప్సరసల నృత్యమును గాంచుచుఁ గొన్నిదినంబులు నీవిందు సుఖంబుండి మాకు సంతుష్టి కలిగింపవలయును. మఱియు నీవిచ్చట నుండుట మహోప కారప్రాప్తికే యగును. ముందు నీకు రానున్న పేడిరూపునకుఁ దగి నట్లుగా నీవు భరతశాస్త్రము నభ్యసింపవలసియున్నది. నీవిచ్చట నున్నంతకాల మాశాస్త్రమును సాంతముగా నేర్చికొనుము." అని యింద్రుఁడు పలికిన పలుకులాలకించి యర్జునుఁడిట్లనెను. "మహాత్మా! నన్నీ యమరలోకసుఖంబు లనుభవించుచు నిందుఁ గొన్నిదినములు నివసింపఁగోరుచున్నారు. అందులకు నాకభ్యంతరములేదు. కాని యటఁ గామ్యవనమునందు మదగ్రజుఁడు ధర్మనందనుఁడును, దక్కం

గలవారును నారాకకొఱకెదురుసూచుచుందురు. నేను తపోవనమునకు వచ్చినది మొదలు నావియోగమును దుస్సహముగాఁ దలంచి నిమేష మొక్క-యుగముగాఁ గడపుదురు. నాక్షేమము వారికిఁ దెలియవల యునుగదా!" ఇంద్రుఁ డంతఁ గుమారునిఁజూచి, "వీరాగ్రణీ! నీవు విచారముడుగుము. రోమమహర్షి సీక్షణమే కామ్యవనమునకుఁ బోయి ధర్మరాజాదులకు నీక్షేమసమాచారమును, నీకు లభించిన పాశుపతాస్త్రవిషయమును, విజయమును దెలిపి వారి వ్యాకులపాటును బోఁగొట్టుమని యడిగి పంపుచున్నాఁడను." అనఁగా నర్జునుఁడు సంతోషించి యమరవల్లభుని యాజ్ఞానుసారము భరతశాస్త్ర మభ్య సించుచు నమరావతియందుఁ గొంతకాలము వెళ్లఁబుచ్చఁదలంచెను.

ఇంద్రుఁడు కోరినప్రకారము సేయఁదలఁచి రోమమహర్షి భూలోకమునందలి కామ్యవనమునుజేరఁ బయనమాయెను. అట ధర్మ నందనుఁడు— "పాశుపతాస్త్ర ప్రాప్తికొఱకు మహేశ్వరునిగూర్చి తపంబుసేయుట కర్జునుఁడు వెడలి బహుకాలమయినది; ఆతని తపము నిర్విఘ్నముగ సాఁగినదో, లేదో! కుబేరసఖుఁ డాతనియం దనుకంప వహించి, యస్త్రము నొసఁగి, సఫలీకృతమనోరథుం గావించెనో, లేదో! ఆతఁ డెట్లున్నవాఁడో!" యని విచారించుచుండెను. అం తలో రోమమునీంద్రుఁ డయ్యెడకరుదెంచెను. ధర్మరాజు భీమునితోను, నకుల సహదేవులతోను బ్రత్యుత్థానమొనరించి, తోడితెచ్చి పీఠమునఁ గూర్చుండఁజేసి, శాస్త్రోక్తవిధినిఁ బూజింపఁగా నమ్మునికులతిలకుఁ డలరి యిట్లు నుడివెను. "ధర్మరాజా! నేను అమరావతినుండి దేవేంద్రుఁడు పంపఁగా వచ్చుచున్నవాఁడను. నీసహోదరుఁ డర్జునుఁడు బహుఘోర ముగాఁ దపంబుసల్పి ఫణిరాజభూషణునిఁ బ్రసన్నునిఁజేసికొని, తదను గ్రహావిశేషంబునఁ బాశుపతాస్త్రలాభంబు వడసినాఁడు. అంతలో నింద్రాదు లాతని భక్తికిని, శౌర్యధైర్యసాహసాది సద్గుణసంపత్తికిని

మనమున హెచ్చుగా మెచ్చుకొని, యతనిఁ జూడఁబోయి యతనిచే స్తుతింపఁబడి యతనిని దమవెంట నిడికొని స్వర్గమునకేఁగిరి. ఇంద్రుని పంపున నీసహోదరుఁడు ధనంజయుఁడు దేవతాప్రీత్యర్థమొక మహోపకారము గావించినాఁడు. సముద్రమధ్యమునం దడఁగియుండి ముల్లోకముల నల్లకల్లోలము సేయుచున్న నివాతకవచులను దైత్యులను నిర్జించినాఁడు. మహోత్సాహముతో మహేంద్రుని సరిగద్దియఁ గ్రాలి యమరవరుల సంస్తుతులం గాంచినాఁడు. ముందాతనికి రానున్న వింతరూపమునకుఁ దగియుండు భరతశాస్త్రము నభ్యసించుటకుఁగాను, ఆతఁడందుఁ గొంతకాల ముండఁదలంచినాఁడు. ఈవిషయము లన్నియును మీకెఱిఁగించుటకే నేను పంపఁబడితిని. ధర్మజా! నీవు విచారంబుడిగి, సంతోషమున నుండుము. నేను దేవలోకమునకుఁ బోవుచున్నాను". అని యమ్మునిచంద్రుఁ డనంతరము నాకమునకేఁగెను. తమ యనుజునకుఁ గలిగిన దివ్యాస్త్రలాభమునకు ధర్మజభీములు హర్షించిరి. తమయన్న వేల్పుల మన్ననలం గొనఁజాలినందులకు నకులసహదేవులు సంతోషించిరి. ఈప్రకారము కొంతకాలము గడచినది. కాని సుందరమందిరములందు వసించి మనోహరోద్యానవనములందు విహరించి, యిష్టమృష్టాన్నములు భుజించి, చీనిచీనాంబరములు ధరించి, మంత్రులు, సామంతులు, సైన్యాధిపతులుఁ గొలుచుచుండఁగా వందిమాగధులకైవారములం బొందినట్టి తానును దన యనుజులును—ఆ దుర్యోధనాదుల మాయవలనను, ఈర్ష్యవలనను, మోసమువలనను, ఈనాఁడు భయంకరారణ్యముల పాలయి, కందమూలాదులచేఁ బొట్టలు నోముకొనుచు, నారలంగట్టి కిరాతులవలె బ్రదుకుచున్నందులకు ధర్మనందనుఁ డెప్పటికప్పుడు తీఱని మనోవ్యథం జెందుచుండెను. ఇట్లుండఁగా నొక్కదినంబున వేదవ్యాసమునీంద్రుఁడు పాండవులం జూడవలయునని మరలఁ గామ్యవనంబునకు విచ్చేసెను; ధర్మజుండు దమ్ములతో నామహనీయు

నుచితగతిని బూజించెను. వ్యాసమునీంద్రుఁడు సుఖాసీనుఁడైన పిమ్మట ధర్మరాజును జూచి, "నీకును దమ్ములకును ద్రుపదపుత్రికకును గుశలమా?" యని ప్రశ్నించెను. ఆ ప్రశ్నకు ధర్మనందనుఁడు కంటఁదడిపెట్టుచుఁ గద్గదస్వరముతో నిట్లని ప్రత్యుత్తరమిచ్చెను. "ఓ మహాత్మా! సర్వజ్ఞులకుఁ జెప్పవలసినదేమున్నది? అరణ్యవాస మొనరించుచున్నవారికిఁ గుశలమెక్కడిది? సిరిసంపదలు గోల్పోయి, జీవచ్ఛవములవలెఁ జావలేక మొండిబ్రదుకు బ్రదుకుచున్నారము. స్వామీ! మాకీ వనవాసక్లేశమును, దక్కుంగల యితరకష్టములును, ఎన్నఁడుతీఱును? మేమెప్పటియట్ల మారాజ్యమును, భోగభాగ్యము లను బొంది యెన్నఁడు సుఖింతుము?" వ్యాసమునీంద్రుఁడు మంద హాసమొనరించి, "జ్యేష్ఠుఁడవగు నీవీరీతినిఁ గలఁగుట పాడిగాదు. ధర్మనందనా! పూర్వము షట్చక్రవర్తు లనుభవించిన కష్టములలో నీ వనుభవించిన కష్టములు సహస్రాంశములయినఁ గావు. పూరూరవ సార్వభౌముఁడు పొందిన యగచాట్లు నీవాలకించిన నాశ్చర్యమొందు దువు!" అనెను. అనఁగా ధర్మనందనుఁ డాశ్చర్యమును, కుతూహల మును బొందుచు, "దేవా! ఆ పురూరవచక్రవర్తియొక్క చరిత మును వినఁగోరుచున్నాఁడను. నాయందనుగ్రహముంచి యద్దాని నానతిండు." అనెను. అంత వేదవ్యాసమహర్షి, షట్చక్రవర్తులలో నొక్కఁడై, దిగంతవ్యాప్తకీర్తిమంతుఁడయిన పురూరవచక్రవర్తి చరి త్రము నిట్లు చెప్పఁదొడంగెను.

## — పురూరవుని వంశావళి. —

పూర్వ మొకప్పుడు గాఢమయిన యంధకారమీజగత్తు నావ రించియుండెను. అందువలన జీవరాశులెల్ల నింతింతనరాని బాధం గుందు చుండెను. ప్రాణికోటులకుఁ గలిగిన విపత్తు నడంచుట కంధకారమును

బాపఁగోరి యత్రిమహామునికి సుతుండై చంద్రుఁడు షోడశకళలతో నుద్భవించెను. ఆచంద్రుఁడు తన పదియాఱు కళలతోఁ దమమునడంచి సర్వజగములను సంరక్షించి, తారాగణములకును, ఓషధులకును అధిపత్యము వహించి లోకోపకారుఁడై వెలయుచుఁ దారయను నామెను బరిగ్రహించెను. తారాచంద్రుల కిరువురకును బుధుఁడను కుమారుఁడుద్భవించెను. ఆబుధుఁడు బుద్ధి కాటపట్టయి, సర్వవిద్యలకును సారకుఁడై, నవగ్రహములలో నొక్కఁడై, మహాపండితుఁడై భాసిల్లుచుండెను. ఆతఁడు సర్వేశ్వరునిగుఱించి, తపోవనమున బహుఘోరముగాఁ దపం బొనరించుచుండెను. అక్కాలమున నీభూమండలమును వైవస్వతమనవు, ఏకహేలగును, ధర్మబద్ధముగను బ్రజానురంజకముగను బాలించుచుండెను. ఆతఁడాశ్రితులపాలిటఁ గామధేనువు; అర్జినులపాలిటి కల్పవృక్షము; శత్రులపాలిటి దండధరుఁడు. బుద్ధికి బృహస్పతి; పరాక్రమమునఁ బరశురాముఁడు; నిత్యసత్యవ్రతుఁడు; సదాచారసంపన్నుఁడు; దయార్ద్రహృదయుఁడు. అమ్మహీజాని మహేంద్రభోగమున దులఁదూగుచు ధరాపాలనము సేయుచుండెను. కాని యాతని కొక పెద్ద కొఱంతగలదు; అయ్యది సంతానములేమి సంతానార్థియై యాభూపతి పుణ్యతీర్థములందుఁ గ్రుంకులిడెను; సమస్త పుణ్యకర్మములు గావించెను; దానములు సలిపెను. కాని చివరకుఁ గృతకృత్యుఁడు కాఁజాలకపోయెను. ఎంతకాలమునకును సంతుగలుగకపోవుటచేత నింతింతనరాని వంతనుబొందుచు నాతఁడు కులగురుండయిన వశిష్టమహర్షినిఁ జూడఁబోయి, భక్తిపూర్వకముగాఁ దత్పాదాంభోరుహంబులకుఁ బ్రణామిల్లి నిలిచెను. వశిష్టుఁడా రాజచంద్రునిఁ దగినరీతిని గౌరవించి కూరుచుండుమని, “ రాజా ! నీకును దేవేరికిని కుశలమేకదా ! రాజ్యములోని ప్రజలీతి బాధలులేక సుఖంబున్నవారలా ? నీయాకస్మికాగమనము నాకచ్చెరువుఁ గలిగించుచున్నది ; ఇందులకుఁ గారణమేమి ?

విస్తరించి చెప్పుము." అనెను. వైవస్వతుఁడు వశిష్టుని కిట్లు సమాధానమిచ్చెను. "ఆచార్యోత్తమా! నాకును, నారాణికిని, రాష్ట్రీయులకును గుశలమేయగును. నాయీయాగమనమునకు హేతువుగదా యడుగుచున్నారు! చెప్పుచున్నాను; వినుఁడు. నేను చిరకాలమునుండి వంశోద్ధారకుఁడగు పుత్త్రునిఁ బడయఁగోరి, పెక్కు సత్కృతులు సలిపితిని; తటాకములు త్రవ్వించితిని; సత్రములు నిర్మించితిని; ఆలయములు కట్టించితిని; మార్గమధ్యమునందుఁ జెట్లు నాటించితిని; మఱియుఁ బుణ్యతీర్థములు సేవించితిని; గోదాన సువర్ణదాన భూదాన ప్రభృత నానావిధానేక దానములు సలిపితిని. కాని యేవిధిచేతను నాయభిమతము సిద్ధింపలేదు. సరికదా, సిద్ధించునన్న యాశయుఁ గుదురలేదు. గురుదేవా! మీకుఁ జెప్పవలసిన దేమున్నది? సుతులు లేనివారికిఁ గతులు లేవుకదా! మహేంద్రవైభవమున్నను, నేను సంతులేమి సుఖింపలేకున్నవాఁడను. నాయనంతర మీప్రాజ్యసామ్రాజ్యమును బాలించుటకును, వంశము నుద్ధరించుటకును నొక సుపుత్త్రుఁడు కావలయును. వానిం బడయుతెఱంగు మీరెఱింగింతురని యెఱింగి మీకడకు వచ్చినాఁడను. అనుగ్రహింపుఁడు." వశిష్టుఁడు వైవస్వతుని నుడులాలకించి విస్మిత నిట్లనెను. "మహారాజా! నీవు పరమశివునుద్దేశించి పుత్త్రకామేష్టినిజేయుము. అప్పుడు నీయభీష్టమీడేరఁగలదు." వైవస్వతుండు పరమానందమంది, గురునకు నమస్కరించి యాశీస్సులంబొంది, సెలవుఁగైకొని సత్వరముగఁ దన రాజధానీ నగరమును జేరుకొనెను. ఒకశుభముహూర్తంబున నమ్మహీపతి అగస్త్యమహర్షిని యాజ్ఞికునిఁజేసి, వేదచోదితముగా శివునుపాసించి, యగ్నిం బ్రసన్నునిఁజేసి, దేవతలం దృప్తిపఱచి, పుత్త్రకామేష్టియాగమును సాంతముగాఁ జేసెను. అప్పట్ల వైవస్వతునిభార్య తన మనమునఁ బుత్త్రిక జనింపవలయునని తలంచి రహస్యముగాఁబలుకఁగా ఋత్విజుఁడును దదభీష్టానుసారముగ మంత్రముల

నుచ్చరించెను. వెంటనే అగ్నిగుండమునుండి "ఇళ" యను నొక కన్యారత్నము వెలసెను. అంత వైవస్వతుండు దనయెద నాశ్చర్యమొందుచు, "ఔరా! ఇదేమి? మున్నెన్నఁడు నిట్టివింతను గన్నదిలేదు. విన్నదిలేదు. పుత్త్రునిఁ బడయఁగోరి పుత్త్రకామేష్టి సేయఁ బుత్త్రిక యెట్లు జనించెను? దీనికిఁ గారణంబు సర్వజ్ఞుఁ డగు వశిష్ఠమహామునీంద్రుఁడే వచింపవలయును." అనుకొని తత్క్షణమే బయలుదేరి వశిష్ఠాశ్రమంబు నకుఁబోయి యందామునితల్లజుని పదపల్లవంబులకెరఁగి, దేవా! పుత్త్రార్థినై, మీరు చెప్పినచొప్పున దప్పకుండ విధ్యుక్తముగఁబుత్త్రకామేష్టిని నిర్వహింపఁగా హోమగుండమునుండి పుత్త్రిక వెలువడినది. ఇందులకుఁ గారణమేమి?" అని ప్రశ్నించెను. వశిష్ఠుఁ డాపలుకుల కాశ్చర్యమొందెను; దివ్యదృష్టివలన జరిగిన విషయమును దెలిసికొనెను. రాజును గనుంగొని, "రాజోత్తమా! నీభార్య సుతను మనమునఁ గాంక్షించి ఋత్విజునితోఁ జెప్పఁగా నాతఁడందులకుఁ దగిన మంత్రము నుచ్చరించెను. అందువలనఁ బుత్త్రిక కలిగినది. కానిమ్ము. అయినదేదో అయినది. గతజలసేతుబంధనమేల? నీవు డెందమునఁ గొందలపాటు నొందకుము. పుత్త్రుఁడే కావలయునన్న కోరిక పెద్దదయినయెడల నీవు మరల నాయాగమును జేయవలయును; మీదంపతులిరువురును బుత్త్రోదయము కాంక్షించి, ఋత్విజునితోఁ జెప్పవలయును; అతండు తదనుగుణమయిన మంత్రము నుచ్చరించును. దానంజేసి మీయభీష్ట మీడేరును; ఇఁక నీవు పోయి, కార్యాచరణమునకుఁ గడంగుము." అనెను. అనఁగా వైవస్వతుండు సంతోషించి, తన నగరమునకుఁ దిరిగివచ్చి యమ్మునిపుంగవునియాజ్ఞ మౌళిందాల్చి, సర్వము నిర్వహించెను. అంత నిళాకన్య సుందరాకారుఁడగు బాలునిగా మాఱిపోయెను. వైవస్వతుం డాసమయమున భూసురుల కగ్రహారములను, మంత్రులకు బిరుదములను, దండనాథులకు లాంఛనములను, సరదారులకు జాగీరులను, పుర

ప్రముఖులకుఁ గానుకలను సమర్పించెను. మఱియు బీదలకెల్లరకుఁ దృప్తిదీఱ భోజనము వెట్టించి, వస్త్రములు దానముచేసెను. నగరమును సింగారింపఁజేసి యుత్సవములు చేయించెను. ఆబాలునకుఁ బెద్దలయను మతంబున సుతద్యుమ్నుఁడని నామకరణ మొనరించెను. సుతద్యుమ్నుఁడు శుక్లపక్షశశాంకరుని చందమున నందమున మీఱుచు దినదినప్రవర్ధమానుఁడుకాఁగా, వాని ముద్దుమాటలను, నగుమోమును, దప్పటడుగులనుజూచి వైవస్వతుఁడు పట్టరాని సంతోషమున నిశ్చింతతో జనానురంజకముగా రాజ్యపాలనము సాగించుచుండెను. ఆబాలుఁడు పంచాబ్దవయస్కుఁడయినంతనే కులగురువులచేత నక్షరాభ్యాసమును జేయించెను. నాఁడు మొదలొక్కని సుతద్యుమ్నుఁ డశేష శేముషీ సంపదను వెదచల్లుచు సమస్త విద్యలు నేర్చెను; విలువిద్య యందసమాన పాండిత్య మలవఱచుకొని, సాటిలేని మేటి విలుకాఁడని యెన్నికఁగాంచెను; తరువాతఁ గొన్నిసంవత్సరములు గడచినవి. ఆతఁడు నవయౌవన విభాసితుండాయెను. కుమారుఁడు పరిపాలనా సమర్థుఁడయినపుడు తండ్రికి భారమెందులకు? వైవస్వతుండు గురునిర్దిష్టమగు శుభముహూర్తమున దనయునకుఁ బట్టాభిషేక మొనరించి, భార్యతోఁగూడఁ దపోవనముల కరిగెను.

సుతద్యుమ్న మహీపతి జనానురంజకముగా రాజ్యపాలనము సేయుచుండెను. అతని యేలుబడిలో జార-చోర వ్యాధి భయంబులు లేశంబులేక, ప్రజలు ధనధాన్య సంపత్తితోఁ దులదూఁగుచు, వర్ణాశ్రమధర్మములు దప్పక, సుఖజీవనము సేయుచుండిరి. సుతద్యుమ్నుఁ డొక్కదినమున మృగయావిహారార్థియై చతురంగబలములతోఁ గాననంబున కరిగెను. అతండు శక్తిసామర్థ్యంబులేపారఁ గిటికేసరి శార్దూల గండభేరుండాది భయంకర వన్యమృగ సందోహమును జెండాడి, చెం

డాడి, మృగయా పరిశ్రాంతిదీఱ సమీపమందున్న కుమారవనమును బ్రవేశించెను. అంబికాదేవి కుమారవనముం జొచ్చిన పురుషులు స్త్రీ రూపధారులగుదురని యొకప్పుడు శపించియుండెను. ఆశాపము ననుస రించి యమహీజాని పురుషరూపముం గోలుపోయి, స్త్రీగా మాఱి పోయెను. రాజుతోఁగూడ నున్నవారా విచిత్రసంఘటనమును గాంచి, విస్మయ విపరీతచేతస్కులై నగరమునకు మరలిపోయి, తమ రాణితో విన్నవించిరి. రాణి కొంతవడి తన్నుఁదానే నమ్మజాలక, వెంటనే బయ లుదేరి, వశిష్టాశ్రమమునకుఁబోయి యామునీశ్వరునకు నమస్కరించి, "మహాత్మా! ఇదేమి చోద్యము? వేఁటవలని యలసటం దీర్చుకొనఁ గోరి సమీపమందున్న కుమారవనంబు సొచ్చి, మన్నాథుఁడు స్త్రీగా మారిపోయెను. అతఁడు తొంటిరీతినిఁ బురుషరూపము ధరించు తెఱం గెయ్యది? అనుగ్రహించి యానతిండు." అని ప్రార్థించెను. వశిష్ట మునీశ్వరుండు దివ్యదృష్టివలన నావృత్తాంతమెల్ల నరసి, "అమ్మా! అంబికాదేవి మున్నొకప్పుడు కుమారవనముచొచ్చిన పురుషులు స్త్రీ లగుదురుగాక యని శపించియుండెను. నీభర్త విధివశంబున నావనంబున కరిగి యాశాపానుమతమునఁ బురుషరూపమును గోలుపోయెను; నీవు విచారింపక, కర్తవ్యమును వినుము; నిశ్చలభక్తితో నిఖలదైవముల నారాధించుచు, నిరంతర దానములు సేయుచుండుము. అచిరకాలము లోనే మరల నాతఁడు శాపవిముక్తిం బడయఁగలఁడు. అని చెప్పి వీటికిఁ బుత్తెంచెను. అమ్మహాపతివ్రత మునివచనములను దలఁదాల్చి భర్తకు శాపవిముక్తి గలుగుటకుఁగాను, సమస్త దానము లాచరించుచుండెను; వేల్పుల నెల్లప్పుడు నారాధించుచుండెను. ఇఁక నట సుతద్యుమ్నుఁడు స్త్రీగా మాఱినవెనుకఁ దొంటియట్లు లిళాదేవి యాయెను. అయ్యిళా దేవి కుమారవనమునఁ గ్రుమ్మరుచు నికుంజపుంజములందు నిదురిం చుచుఁ వన్యఫలముల నారగించుచు, సెలయేటినీరుం గ్రోలుచుఁ గొంత

కాలముం గడపెను; ఆమెకు మదనసంతాపము నానాఁటి కగ్గలమగు చుండెను. అందువలన సమీపమందున్న మునుల యాశ్రమములకుఁ బోవుచుండెను. ఆరీతిని బోవుచు నొక్కదినంబున నామె, తపోనిష్ఠాగరిష్ఠుఁడై యున్న బుధుని యాశ్రమముఁ బ్రవేశించెను. బుధుఁడు కనులు దెఱచి, మూర్తీభవించిన సౌందర్యరాశియో, ఇలకవతరించిన రతీదేవియో, మేఘమాలికలనుండి వెలువడిన మెఱపుఁదీఁగయో యనునట్లు నిరుపమానమగు సోయగముతోను, సాటిలేని మేటిలావణ్యముతోను గ్రాలుచుఁ జంద్రుని ముఖముచేతను, బింబమును అధరముచేతను, చంపకమును నాసికచేతను, శ్రీకారములను కర్ణములచేతను, మీలను నేత్రములచేతను, దుమ్మెదరుగురులచేతను, సువర్ణకలశములను స్తనములచేతను, సింహమును మధ్యముచేతను, సైకతప్రదేశములను గటిసీమలచేతను, రంభాస్తంభముల నూరువులచేతను, ప్రవాళములను బాదములచేతను, రాజహంసలను నడకలచేతను, చిలుకలను పలుకులచేతను దిరస్కరించుచున్న యాసుందరీమణి నవలోకించి మన్మథవికారపరితప్తచిత్తుండాయెను. ఇళాదేవియుఁ దేజశ్శాలియగు బుధుని గనుంగొని మోహోద్రేకమునుజెంది, తన హృదయమును హావభావములచేత వాని కెఱిఁగించెను. బుధుండు ప్రమోదమునుజెంది, గాంధర్వవిధిని ఆమెను బరిగ్రహించెను. ఇళా బుధు లిరువురును దద్దయుం బెద్దకాలము కామోపభోగ సుఖంబులం దేలియాడిరి.

## —♦ పురూరవ జననము. ♦—

ఓధర్మనందనా! వినుము. అట్లు మన్మథక్రీడలందేలి యాడుచున్న యిళా బుధులకు నొక్క శుభముహూర్తమున గ్రహములు ప్రసన్నభావయుక్తములై యుండగా, నొక్కకుమారుఁ డుదయించెను. ఆబాలుఁడు కోటిసూర్యప్రభ భాసమానుఁడై వెలుఁగొందుచుండెను;

అందమున మన్మథుఁ డాతని కీడు కాఁజాలఁడు ; కాంతిచేత సూర్యచంద్రులను, అగ్నిహోత్రునిఁగూడ నాబాలుఁడు డీలుపఱుచును. మహామునులందరును బండితోత్తముండగు బుధుని యంశమున నుద్భవముగన్న యీసుందర సుకుమార బాలునకుఁ "పురూరవుండ"ని పేరిడిరి. పురూరవుండు శుక్లపక్షమునందలి చంద్రునివలె దినదిన ప్రవర్ధమానుఁడగుచుండెను. ఇట్లు కొన్ని దినములు గడచునరికి బుధుఁడు దన తపోనిష్ఠను మగిడి ననుసరింపఁగోరి వైరాగ్యముఁబొందెను. ఇళాదేవియు దొంటిరూపును బొందఁగోరి, కుమారుఁడగు పురూరవుని వెంటనిడికొని, వశిష్ఠాశ్రమమును బ్రవేశించి, యమ్మునీశ్వరునకు నమస్కరించి, తన వృత్తాంతమంతయును విన్నవించి, "గురుదేవా! నాకెప్పటి రూపము ప్రాప్తించునట్లను గ్రహింపుఁడ" ని మ్రొక్కెను. వశిష్ఠుఁడు శిష్యవత్సలుండగుటచే నిశ్చలధ్యానమవలంబించి, పరమశివునిఁ దలంచెను. పరమశివుండు భక్తవత్సలుండగుటచే నాక్షణమే వశిష్ఠునకు సాక్షాత్కరించి, "మునిచంద్రమా! నన్ను ధ్యానించుటకుఁగల కారణమెఱిఁగింపుమ" నెను. వశిష్ఠుఁడు భక్తితోఁ బార్వతీవల్లభునకు నమస్కరించి, బహుభంగుల నాతని సన్నుతించి, "ఓయిందుశేఖరా! ఇట స్త్రీరూపముతోఁ గనఁబడుచున్న యీతఁడు సుద్యుమ్న రాజేంద్రుఁడు; మత్ప్రియశిష్యుఁడు. అంబికాశాపగ్రస్తమగు కుమారవనమును బ్రవేశించి యిటులయ్యెను. దేవా! ఈతనికిఁ దొంటి పురుషరూప మనుగ్రహింపవే!" యని ప్రార్థించెను. శివుండిట్లు మాఱువలికెను. "బ్రహ్మర్షిపుంగవా! కుమారవన మంబికాశాపగ్రస్తము. అందుఁ బ్రవేశించి, నీవు చెప్పినచొప్పున నీతఁడీ రూపుం దెచ్చికొన్నాఁడు. అంబికాదేవి శాపము వ్యర్థము కాఁజాలదుకదా! కాఁబట్టి వినుము. ఈసుద్యుమ్నుఁడు యథారూపముం బడయఁగల్గియుఁ మూఁడు నెలల కొకతూరి మూఁడు దినములు స్త్రీరూపముతోనుండును." ఇట్లుచెప్పి సుద్యు

మ్మునకుఁ బురుషరూప మనుగ్రహించి యిష్టవరము లొసంగి యంతర్హితుండయ్యెను. సుద్యుమ్నుఁడు గురుదేవుని పాదములకు మ్రొక్కి “దేవా! మీయనుగ్రహంబున శాపవిముక్తిం బడయుటమాత్రమే కాక, అమరదుర్లభంబయిన యీశ్వరసాక్షాత్కార లాభమునుసైతము పొందఁగలిగితిని. నాసుతునీ పురూరవుని సకలశాస్త్ర ప్రవీణునిగా నొనరింపుఁడు. నాకు సెలవొసంగుఁడు.” అని పుత్త్రుని విడిచి, ముని యొక్క దీవనలంబొంది రాజధానీ నగరమునకుఁ బోయి, భార్యతో సుఖంబుండెను. పురూరవుండు భక్తిశ్రద్ధలతో వశిష్ఠమునీశ్వరునకు శుశ్రూషలు సలిపి యమ్మహాత్మునివలన సమస్తవిద్యల నభ్యసించి, విద్యాసమాప్తి యగుటతోనే యాతండు పుత్త్రెంచఁగాఁ దండ్రియొద్ద కరిగెను. సుద్యుమ్నున కాలోపున మఱిమువ్వురు కుమారు లుదయించిరి. సుద్యుమ్నుఁడు, జ్యేష్ఠుఁడగు పురూరవుండు యుక్తవయస్కుఁడైనంతనే యాతనికి రాజ్యాభిషేక మొనరించి, తాను భార్యాసమేతుఁడై తపోవనముల కరిగెను. అటఁ జిరకాలము నిశ్చలచిత్తముతోఁ బరమేశ్వరునిగూర్చి తపం బొనరించి, బ్రహ్మపదమును బొందెను.

పురూరవుండు ప్రతిష్ఠానపురము రాజధానిగా విలసిల్లుచుండఁగా జనానురంజకముగాఁ బాలించుచుండెను; యౌవనదశయందున్న యమ్మహీజాని మన్మథుని ధిక్కరించుచుండెను; పరాక్రమముచేతను, శౌర్యధైర్యసాహసౌదార్యాదులచేతను, అద్వితీయుఁడై యాశాంతవ్యాప్తమగు యశశ్చంద్రికతోఁ బ్రకాశించుచుండెను. ఏఁబదియేఁడు దేశముల రాజులనోడించి, సామంతులుగాఁ జేసికొని, కప్పములుగొనుచుండెను. అమ్మహీపతి యాజ్ఞ నతిక్రమించువారు మర్త్యులయందు మాత్రమే కాక, తక్కుంగల దివ్యజాతులయందును గానఁబడరు. ఆతని యేలుబడిలోఁ బ్రజలు ధర్మపరాయణులును, వర్ణాశ్రమాచార

ములయం దనురక్తిగలవారును, సత్యసంధులును, నీతిబద్ధులును అయి యుండిరి. మఱియు జారులు, చోరులు, దుష్టులు మచ్చునకొక్కరయినను, మాఱుమూల ప్రదేశమునం దయినను లేకుండిరి. కుబేరునకుఁ బెట్టుబడి పెట్టఁగల స్థితిలోనుండిరి. ప్రభుభక్తి గలిగియుండిరి. భార్యలకు భర్తలయందును, పిన్నలకుఁ బెద్దలయందును, శిష్యులకు గురువుల యందును, క్రిందియుద్యోగుల కధికారులయందును భక్తితాత్పర్యము లధికములై యుండెను. ఎల్లయెడల సంతోషమే ద్యోతకమగుచుండెను ; ధర్మదేవత నిరాతంకముగా నిరంతరము నిఖిలసీమలయందును విహరించుచుండుటవలన దుఃఖపిశాచమునకును, పాపభూతమునకును బురూరవ సామ్రాజ్యమునందుఁ దలదాచుకొనుటకుఁ దావులేకపోయెను.

పురూరవచక్రవర్తి చతుస్సముద్రముద్రితంబగు ధరామండలము నేకహేలగాఁ బాలించుచున్న కాలమున నొకదినమున నమరావతీపురంబున దేవేంద్రుఁడు కొలువుండెను. రంభ, ఊర్వశి, మేనక, తిలోత్తమ మున్నగు నచ్చరలేమలు ముచ్చటదీఱ నృత్యము సలుపుచుండిరి. అంతలో నగస్త్యమహర్షి యాసభకు విచ్చేసెను. ఆమునికుల సార్వభౌముని గాంచినంతనే యూర్వశిదక్కఁ దక్కుఁగల యప్సరసాంగనలు వినయ ముట్టిపడునట్లు నమస్కరించి, దీవనలం బొందిరి. ఊర్వశి యించుకంత యతిశయముతో నమ్మునీశ్వరుని జూచియుఁ జూడనట్లు మిన్నకుండెను. ఆమె యుదాసీనత కగస్త్యమహర్షి మండిపడెను: “ ఓ యూర్వశీ ! నీయంత యందకత్తె వేఱొకతె భూమండలమున లేదనికాఁబోలు నిట్లు గర్వించియున్నావు ; మాదృశులయెడ నీకింత యలక్ష్యభావ మేలయుండవలయును ? కానిమ్ము. కొంతకాలము నీవు భూలోకమునందు సంచరించుచు మనుజనివాం దనుభవించుము. ఇదియే నీకు శాపము. ” అనెను. ఆ శాపమున కూర్వశి మిక్కిలియు విచారించెను. కాని యేమిచేయఁగలదు ? చక్రి చక్రమునకయినను, వజ్రి

వజ్రమున కయినను, దిరుగుండవచ్చును గాని మహర్షుల శాపములకుఁ దిరుగుండదుకదా ! అమోఘంబగు నగస్త్యశాపమును ద్రిమ్మరింప నెవరికి సాధ్యము ? ఊర్వశి స్వయంకృతాపరాధమున కెంతయుఁ జింతించి, ప్రారబ్ధకర్మఫల మవశ్యభోక్తవ్యమని యెఱింగి భూలోకమునకుఁ బోనుండెను. అంతలో నారదుండామెను గనుంగొని, "నీవు విచారింపఁ బనిలేదు. భూలోకమున కింద్రుఁడై పురూరవచక్రవర్తి ప్రతిష్ఠాన పురమును రాజధానిగాఁ జేసికొని పాలించుచున్నాఁడు. అమ్మహీపాలుఁడు చంద్రవంశభూషణుఁడు ; రూపజితమారుఁడు ; మహేంద్ర వైభవోపేతుఁడు ; మానధనుఁడు ; అసమానతేజశ్శాలి ; నీవాతని నాశ్రయించితివేని ధన్యురాలివగుదువ" నెను. అప్పలుకుల కూర్వశి సంతసించి, అగస్త్యశాపానుసారముగ భూలోకమునకుఁ బోయెను. నాఁటికి దేవేంద్రుఁడు కొలువుఁ జాలించెను.

—♦ పురూరవసార్వభౌముఁ డూర్వశిని బరిగ్రహించుట. ♦—

పురూరవసార్వభౌముఁ డొకదినమున హృద్యోద్యానవనమధ్యమున విహరించుచుండెను ; నానావిధఫలపుష్పశోభితములగు వృక్షములాతని చిత్తము నాకర్షించుచుండెను ; సౌరభప్రదములగు పూగుత్తులాతని నాసికకు విందుసేయుచుండెను. అంతలో నూర్వశి యాయుద్యానవనముం బ్రవేశించి యించుక దూరమందు నిలువఁబడియుండెను ; ఊర్వశీ పురూరవు లొకరినొకరు చూచుకొనిరి ; ఒకరి చూపులలో నింకొకరి చూపులు కలిసినపుడే యొకరిచిత్త మింకొకరిచిత్తమునందు హత్తుకొనిపోయినది. పురుషులలో నింతటియందగాఁ డింకొకఁడు లేఁడని యూర్వశి యనుకొన్నది. ఎలనాఁగలలో నింతటి యందకత్తె వేఱొకతె యుండదని పురూరవుండు దలంచెను. అంతలో మన్మథుఁ డయ్యిరువురతలను సంధానకర్తయై, తన ప్రభావముఁ జూపనారంభిం

చెను. పురూరవుండా యచ్చరమచ్చెకంటిని డాయుంబోయి, మంద హాసము ముఖారవిందమునందుఁ జిందులు ద్రొక్కుచుండఁగా "ఓ రమణీమణీ! నీవెవ్వతెవు? నీ నామధేయమేమి? ఎందుండి వచ్చితివి? నీవృత్తాంత మాలకించుటకు హృదయము తొందరపడుచున్నది; ఆన తిమ్ము." అనెను. అనఁగా నూర్వశి, క్రేఁగంటి చూపుక్రాలం బ్రస రింపఁజేయుచుఁ మందహాసమొనరించుచు నిట్లు మృదుమధురస్వరంబునఁ బ్రత్యుత్తరమిచ్చెను. "ఆర్యపుత్రా! నేను దేవేంద్రుని యాస్థానము నందుండు నచ్చరలేమను; నన్ను ఊర్వశియందురు. నారదమహర్షి మీ గుణగణములను, రూపురేఖావిలాసాదులను వర్ణించి చెప్పఁగావిని, మిమ్ములను దర్శింపవచ్చితిని." పురూరవుం డూర్వశియొక్క ప్రఖ్యాతి నాలకించి యుండుటచే నామెను బ్రత్యక్షముగాఁ జూడఁగలిగినందుల కెంతయును హర్షించి, "ఓ సుందరాంగీ! ఈ సమయమున నీవు నా శృంగారవనమును బ్రవేశించి, నాదృష్టితోఁబాటు చిత్తమును గూడ నాకర్షించితివి. మన్మథుఁడు నాహృదయమునం దిపుడు స్థిరనివాసము నేర్పఱుచుకొనియున్నవాఁడు. అతని విజృంభణ మంతకంతకధికమగు చున్నది. ఇఁక దాచనేల? వినుము. నేను నీయందు మరులుగొంటిని. నీవు నాకోరిక నీడేర్పవలయును." అనెను. అమ్మహీపతియందుఁ దనకు మోహావేశము కలుగుటవలనను, అగస్త్య శాపమువలనను, ఊర్వశి నిరాకరింపక, అట్టి సుపవిత్రచరిత్రుఁడు లభించినందులకుఁ దన మహా భాగ్యమనుకొని మెల్లగా నిట్లు ప్రత్యుత్తరమిచ్చెను. "రాజచంద్ర మా! భూపురందరులరగు మీతోడి పొందు నాకానందదాయకమే యగును; కాని మీరు నాకొక బాసచేయవలయును. నేను మీయొద్ద స్థిరముగా నెల్లప్పుడు నుండుదానఁగాను. నేనొకప్పుడు మిమ్ముల నెడఁ బాసి యింద్రలోకమునకుఁ బోవుదును. అపుడు మీరు నావియోగ మునకు దుఃఖించి, నేను మిమ్మన్యాయము చేసితినని యెంచరాదు.

ఇయ్యది మీకు సమ్మతమయిన మీతోడి సుఖానుభవము నాకు హర్ష హేతువేయగును." పురూరవుండు దేవవేశ్య నవలోకించి, "సుందరాంగీ! నీవు ఎన్నెపుడు బాసిపోవుదువు?" అని ప్రశ్నించెను. "రాజా! వస్త్రములేకుండ మీరెపుడు నాకంటఁబడుదురో, ఆ నిమేషమున నేను మీనుండి వెడలిపోవుదున"ని యూర్వశి బదులు చెప్పెను. పురూరవుండు సమ్మతింపఁగా నూర్వశి యాతనితోఁ గలిసి యనంగక్రీడలం దేలియాడుచుండెను. ఈ రీతిగాఁ గొంతకాలము గడచినది.

## —♦ ఊర్వశి పురూరవునివిడిచి వెడలిపోవుట. ♦—

అట దేవేంద్రుఁ డూర్వశీవియోగమున కోర్వలేక గంధర్వుల నిరువురనుబిలిచి యామె నెట్టులయిన భూలోకమునుండి తోడ్కొని రమ్మనిపంచెను. వారొకనాఁటి రేయి రహస్యముగా నూర్వశీదేవిని బ్రతిష్ఠాన పురమునందలి రాచనగరునం గలసికొని, "నీకొఱకు నివాసవల్లభుఁడగ్గలమగు బాధననుభవించు చున్నాఁడు. నీవియోగ మాతనికి దుస్సహముగానున్నది. కాఁబట్టి నీవు తడయక వెంటనే దేవలోకమునకు రావలయుననిరి." ఊర్వశియు, దేవలోకమును విడిచివచ్చి, భూలోకమునకువచ్చి చాలకాల మగుటచేతను, దేవేంద్రునియందు మోహ ముదయించుటచేతను, భూలోకమును విడిచి పోవలయునని నిశ్చయించుకొని యాగంధర్వుల నవలోకించి, "అయ్యలారా! నేను రెండు మేఁకపిల్లలను బెంచుచున్నాను; మీరు రేపురాత్రి నేనును బురూరవసార్వభౌముఁడును రతిక్రీడలందేలి యాడుచున్న సమయమున నాపెంపుడు మేఁకపిల్లలను దొంగిలించుకొనిపొండు. రాజు మిమ్ములను దఱుముకొని వచ్చినయెడల మీరు వానిని విడిచి పొండు." అనెను వారు వల్లెయని యారాత్రి మట్టుకుఁబోయిరి. మఱునాఁటి రాత్రి పురూరవుండూర్వశితో రతిసుఖ మనుభ

వించుచుండెను. ఆసమయమున నానందాతిరేకమున నాతఁడు పార వశ్యముఁజెంది వస్త్రవిహీనుఁడై యుండెను. ఊర్వశియొక్క పెంపుడు మేఁకపిల్లలు రెండును గొంచెము దూరమున నాడుకొనుచుండెను అంతలో గంధర్వులిరువురును వచ్చి యామేఁకపిల్లల నెత్తుకొని పాఱిపోవు చుండిరి. ఊర్వశి యదిచూచి గొంతెత్తి " రాజా ! రాజా ! అటుచూడుమటుచూడుము. ఎవరోచోరులు నాపెంపుడు మేఁకపిల్లలనెత్తుకొని పోవుచున్నారనెను. రాజా మాటలను సరకుఁగొనక, తన్మయత్వముతో మరునాలమున మునిఁగియుండెను. అంత నూర్వశి మరల గొంతెత్తి, ' అయ్యో ! ఇదేమి యన్యాయము ! రాజా ! నీరాజ్యమునందుఁ జోరులు నిర్భయముగా విహరించుచుండుటా ! నీధర్మ పరాయణత్వ మేమయినది ! నాపెంపుడుమేఁకపిల్లలనువొంగిలించుకొనిపోవుచుండఁగా, నీవుపేక్షవహించి మిన్నకుందువా ! ' యనెను. తోడనే పురూరవుండు లేచి, వస్త్రమునయినఁ గట్టుకొనక, చంద్రాయుధమును గేలంబూని యాగంధర్వుల వెంటాడెను. వారు మార్గమధ్యమునందు మేఁకపిల్లలను విడిచి, దేవలోకమునకుఁ బోయిరి. పురూరవుండు వానితోఁ దిరిగి వచ్చుచుండఁగా నూర్వశి రెండుచేతులతో ముఖమును గప్పుకొని, " రాజా ! నీవు వస్త్రవిహీనుండవై నాకంటఁబడితివి. కనుక నీక్షణ మందే నిన్నువిడిచి నేను పోవుచున్నాను. " అని దేవలోకమునకుఁ బోయెను. పురూరవుండు ఊర్వశి వియోగమునకుఁ దాళఁజాలక, వికల చిత్తుఁడై సరస్వతీ తీర్థమునకుఁబోయి, నిద్రాహారములుమాని రాత్రిం బవళ్ళు " హా ప్రాణనాయికీ ! ఊర్వశీ ! " యని కలవరించుచుండెను. దేవలోకమునకుఁ బోయిన యూర్వశి సరస్వతీ తీర్థమునందు విరహాగ్ని సంతప్తచిత్తుఁడై యున్న పురూరవుని మ్రోలవచ్చి నిలచెను. అప్పుడా నుపీంకాంతుఁ డామె నవలోకించి, " ప్రేయసీ ! నీవు దేవవేశ్యవయ్యు జాతి స్వభావమును విడువవయితివిగదా ! నీయందు గాఢానురాగము

గలిగియున్నందులకు నన్నిట్లు వంచించుట పాడియా ! నీకంటె నాకాప్తు లెవ్వరునులేరని నే నెంచుచుండఁగా నాకంటె నీకుఁ దక్కుంగలవారాప్తు లగుదురా ! నిన్ను విడిచి నేనొక్క నిముసమయినఁ బ్రాణములతో మనఁజాల నేమందువు ! ” అనెను. అనఁగా నూర్వశి, “ రాజా ! స్వస్థ చిత్తుఁడవుగమ్ము ; ధర్మవిదుండవగునీవు పామరుని చందమునమోహాంధకారమునఁబడి యితరములం గానకుండుట న్యాయమా ! నేను మహేంద్రుని సభనువిడిచి యుండుదానఁగాను. ఒక్కసంవత్సర మెట్లో కాలము గడుపుము. సంవత్సరానంతరము మరల నీయొద్దకువచ్చి నిన్నుఁ బరితుష్ట మనస్కుం గావింతును. ” అని దేవలోకమునకు నిష్క్రమించెను.

## —♦ ఊర్వశీ పురూరవుల పునస్సమావేశము. ♦—

పురూరవుండూర్వశీ వియోగమునఁగుందుచు దినమొకయుగముగా నతికష్టముమీఁద నెట్టుచుండెను. ఎట్టులో యొక సంవత్సరము గడచినది. ఊర్వశి తాను చేసిన బాసతప్పకుండ భూలోకమునకువచ్చి పురూరవునితోఁగలిసి కొన్ని దినములుండి యాతనిని మన్మథక్రీడల ముంచెత్తి యానందసాగరమున నోలలాడించినది. పురూరవ మహారాజున కూర్వశి యందు నల్వురుకుమారు లుదయించిరి. వారు భుజబలాఢ్యులును, సకల కళా పారంగతులును, కీర్తిమంతులునునై విలసిల్లిరి. చిరకాలము గడచినపిదప నూర్వశి పురూరవు నుద్దేశించి యొక్కదినంబున, “ మనోహరా ! నేను దేవలోకము విడిచివచ్చి చిరకాలమయినది ; నిన్ను సకల సౌఖ్యములచేతను దృప్తి పఱచితిని. ఇఁకనాకు సెలవొసంగుము. ” అనెను. ఆపలుకులకుఁ బురూరవుండాననంబున దీనభావంబు ప్రకటితము కాఁగా నిట్లనెను. “ ప్రేయసీ ! నాచిత్తము నీయందు హత్తుకొనిపోయినది. నిన్ను విడిచియుండుటకే నెట్లనుమతింతును ! నిన్నుఁ బొందుటకుఁ

దగినమార్గమును నాకెఱింగింపుము." అనఁగా నూర్వశి యాలోచించి, "రాజా! గంధర్వ రూపవతులను మనమున ధ్యానించుచు మీరు తపంబు సల్పినచో నన్నపుడు పొందఁగలుగుదురు." అని నుడివి యాతనికడ సెలవుఁగైకొని దేవలోకమునకుఁబోయెను.

## —— ♦పురూరవుని వివాహము.♦——

తరువాతఁ గొంతకాలము గడచినది. పురూరవ సార్వభౌమునకుఁ జిత్తశాంతి కుదురలేదు; ఆతని మనస్సు ఊర్వశియొక్క సౌందర్యము నందే స్థిరమైయున్నది. అందువలన నామెతోడి వియోగ మాతనికి దుస్సహమయినది. కాఁబట్టి రాజ్యపాలనమునకు సుతులను నియోగించి, పురూరవుండు సరస్వతీతీర్థమునుజేరి యందొక ప్రశాంతస్థలమున సరసి యటఁ గూరుచుండి మనమున గంధర్వరూపవతులను ధ్యానించుచు నూర్వశికొఱకుఁ దపముసేయుచుండెను. ఆతని తపమున కాగంధర్వ స్త్రీలుమెచ్చి యగ్నిస్థానము నేర్పఱిచి, "దీనిమూలమున నీయభీష్ట మీడేరును" నిచెప్పి యంతర్హితులయిరి. ఆయగ్ని మాంగల్యమును గైకొని, ఊర్వశీ సాక్షాత్కార మభిలషించుచుఁ బురూరవుండావన ముననే క్రుమ్మరుచుండెను; కాని యూర్వశి సాక్షాత్కార మాతనికిఁ గలుగలేదు. "అకటా! ఈ వేశ్యను విశ్వసింపనేల? సద్వంశ సంజాత యగునొక్క నారీరత్నమునుగోరి పరిణయము సేసికొన్నయెడల నాకీ వియోగము కలుగకుండెడిదికదా! యని చింతించుచు నాయగ్ని మాంగల్యము నొకపరిశుద్ధ ప్రదేశమునునుంచి, ప్రతిష్ఠానపురమునకుఁబోయి రాజ్యభారమును వహించి, కుమారులతో సుఖంబుండెను.

ధర్మనందనా! వినుము. ఆకాలమున విశాలనగరమను నొక నగరముగలదు. అద్దానిని సోమదత్తుడను నృపపుంగవుడు పాలించుచుండెను; ఆతఁడు విపక్షశిక్షాదీక్షాదక్షుఁడును, శరణాగత వత్సలుండును నై

ప్రజానురంజకముగా ధరాపాలనము సేయుచుండెను; కాని, సంతాన రహితుఁడగుటవలనఁ జింతాక్రాంతుఁడై యుండెను. అమ్మహీజానియొకదినమున పురోహితామాత్య సామంతాదులతోఁ గొలువున్న తఱిని, వారినవలోకించి, "నేను సంతానముకొఱకుఁ జిరకాలమునుండి యుత్సాహముఁజెందుచు, బహుదానములొనరించితిని; కాని దైవకృప కలుగలేదు; సంతులేనివాని జన్మము వ్యర్థము; బిడ్డలులేని యాలయము మహాలయము. కాఁబట్టి నేనిపుడు భార్యాసమేతుఁడనై, సమస్తభోగములు పరిత్యజించి మునికులోచిత వేషములతో నడవికిఁబోయి మునిజనులసేవించి కృతకృత్యుండఁ గాఁ దలంచుచున్నాఁడను; కాబట్టి నేను మగిడివచ్చువఱకు నీరాజ్యమును మీరు సంరక్షింపవలయును. ప్రజల కేకొఱంతయు వాటిల్లకుండఁ జూడవలయును." అని యొక శుభముహూర్తమున రాజ్యభారమును మంత్రుల భుజాస్కంధములపై నిడి భార్యతోఁ గూడఁ గాషాయ వస్త్రధారణ మొనరించి, నగరు విడిచి, తపోవనములకరిగెను. అందుఁ గనఁబడిగ మహర్షుల యాశ్రమములకుఁబోయెను. ఆరాజదంపతులిరువురును భక్తి విశ్వాసములతో మహర్షులను సేవించుచుండిరి. ఇట్లు కొంతకాలము గడచినది. ఎల్లవేళలయందు, దమ్ము భక్తివిశ్వాసములతో సేవించుచున్న రాజదంపతులయెడఁ దపోధనులగు మహర్షులు ప్రసన్నులైరి. వారి నవలోకించి, "ఓ ప్రభుదంపతులారా! రాజ్యభోగములు విడిచి, కాషాయవస్త్రములుధరించి మీరీయడవి కరుదెంచి మాయాశ్రయముల నాశ్రయించి మమ్ములను గొలుచుచుండుటకుఁ గారణమేమి? మీసేవకు మేము సంతృప్తిఁ బొందితిమి; మీయభీష్ట మీడేర్తుము; వినిపింపుఁడ" నిరి. అనఁగా సోమదత్తమహారాజు సంతసించి, వినయగర్భితముగ నిట్లనెను. "తపోధనులగు నోమహాత్ములారా! మీఱెఱుంగని ధర్మములులేవు; అపుత్రులగువారికిఁ గతులు లేవని మీరు వచింతురు. చిరకాలమునుండి

మేము రాజ్యమును బాలించుచు, సమస్త దానము లొనరించియు, సంతానభాగ్యమును గాంచలేకపోయితిమి; సంతానము గలుగు మార్గము మీరు బోధింతురని యీరీతిని మీపాదపద్మముల నాశ్రయించుచున్నాము. మహర్షులు సోమదత్తుని సఫలీకృతమనోరథుంజేయం దలంచి, యొక యాగశాలను నిర్మించి యొక శుభముహూర్తమున యజ్ఞము సేసిరి. అందుల కగ్నిహోత్రుడు హెచ్చుగ మెచ్చుకొని సాక్షాత్కరించి, మహర్షులకొక పాయసాన్న పూరితభాండము నొసంగి యదృశ్యుడయ్యెను. మహర్షులా భాండమును సోమదత్త మహారాజున కిచ్చి, "రాజేంద్రా! ఇందలి పాయసాన్నమును నీవు నీ భార్యకుం బెట్టుము. దీనిని భుజించినంతనే యామె గర్భవతియై పరాక్రమ ధనుం డును, బాల భాస్కర ప్రభా భాసమానుండును నగు నొక కుమా రునిం అసమానలావణ్య రాశియు, సుపవిత్ర చరిత్రియునగు నొక కొమరితను గనును. నీవిఁక భార్యతోం బురంబునకుంబోయి సుఖంబుం డుము." అని యాశ్వీరదించి పంపిరి. సోమదత్తమహారాజు నిర్భరానంద మునుజెంది, భార్యకాపాయసాన్నమిచ్చి, దాని నామెభుజించిన పిమ్మట విశాలనగరమునకు మగిడిపోయెను. అట నాతని యర్ధాంగి యంతర్వత్ని యయినది. నవమాసములు గడచినపిమ్మట నొక శుభముహూర్తమున నామె యొకకుమారుని, నొకకుమార్తెను బ్రసవించెను. మహారాజింతిం తనరాని సంతోషముతో నాసందర్భమున నెల్లదానము లాచరించెను. మహర్షులు దివ్యదృష్టివలన సోమదత్తునకు సంతుగలుగుట నెఱింగి, వెంటనే బయలుదేరి విశాలనగరమునకు వచ్చిరి. రాజు తగువిధం బున వారినిం బూజించెను. పిమ్మట నొక బంగారు తొట్టెలోం దనబిడ్డల నిరువుర నుంచుకొని మహర్షులయొద్దకుం గొంపోయి చూపెను. అమ్మహాత్ములు వారిని దీవించిరి. బాలునకు సుమతిం జయుండనియుం బాలికకు జయప్రదయనియుం బేళ్లుపెట్టిరి. పిమ్మట

వారు రాజునకుఁ గావలసిన వరములిచ్చి, బాలబాలికల కిరువు రకును జరుపవలసిన శాస్త్రోక్తకార్యములెల్ల జరిపించి, తమ తమ నెలవులకుఁ బోయిరి. జయప్రదా సుమతింజయు లిద్దఱును శుక్ల పక్షమునందలి చందురునివలె దినదినప్రవర్థమాను లగుచుండిరి. మహా రాజు వారికి ఉచితవిద్యలెల్లఁ జెప్పించెను; రూపసంపదకుఁ దోడు, విద్యాసంపదయు, విద్యాసంపదకుఁదోడు వినయసంపదయుఁ గుదుర వారు చూపఱుల మానసముల నాకర్షించుచుండిరి. ఇట్లు కొంతకాలము గడచినది. జయప్రదాదేవికి యౌవనము తొంగి తొంగి చూచు చున్నది. అందువలన జనకుఁడయిన సోమదత్తమహారాజు, ఒక సువర్ణ మందిరము నామెకొఱకుఁ బ్రత్యేకముగా నిర్మించెను; పెక్కుమంది దాసీల నందుఁ గొలువునకుంచెను; సింగారించుటకునుఁ కథలు చెప్పు టకును, వేడ్క గలిగించుటకును, అప్సరసలవంటి చెలికత్తెల నెందఱినో యందుంచి వారితో జయప్రదాదేవి నందుంచెను. జయప్రదాదేవి యా బంగారు మేడలో సఖురాండ్రతో హాయిగా కాలము వెళ్లఁ బుచ్చుచుండెను; ఒక్కనాఁ డొక్కచెలిమికత్తె ఏదో సందర్భమున భూలోకమునందలి రాజవరేణ్యు లందఱిలోను, రూపముచేతను, సంపద చేతను, శౌర్యధైర్యసాహసౌదార్యాది సద్గుణసంపత్తిచేతను, తేజస్సు చేతను, ప్రభావముచేతను, భగవదంశచేతను, పురూరవసార్వభౌ ముఁడే యధికుఁడనియు, శ్రేష్ఠుఁడనియుఁ జెప్పెను. ఆ మాట లామె చిత్తము నాకర్షించినవి. ఆమె యాచెలిమికత్తెను మాటిమాటికిని బురూ రవుని గుఱించిన వృత్తాంతమే చెప్పుమని యడుగుచుండెడిది. చెలిమి కత్తె చెప్పుచుండెడిది. తోడనే జయప్రదాదేవికి పీనుకవి కూరిమికలి గెను. ఆమె నాఁటినుండియు నిద్రాహారపానీయముల నొల్లక చిత్త వైకల్యమును బొందెను; సఖులు పిలిచినఁ బలుకుటలేదు; చిలుక లకుఁ బలుకులు చెప్పుటలేదు; హంసలకు నడలు గఱపుటలేదు; చెలి

కత్తె లామెపరివర్తనముం గనిపెట్టిరి. ఆమె పురూరవచరిత్రము నాల కించినది మొదలు మదనసంతాపమునకు గుఱియయినదని గ్రహించిరి. ఆసంగతిని ప్రభుదంపతులకుఁ దప్పక చెప్పవలయుననియు, లేకున్న ముప్పు వాటిల్లుననియుఁ దలంచిరి. మహారాజును సందర్శించి, " దేవా! జయప్రదాదేవి ప్రసంగవశమున నేఁటికిఁ గొలఁదిదినములకుఁ బూర్వ ము పురూరవసార్వభౌముని రూపురేఖాభివర్ణనము నాలకించెను; నాఁటినుండియు నాహారమును వేళకుఁ గైకొనుచుండుటలేదు; మధుర పానీయములను స్వీకరించుటలేదు; చందనమలందినను, సుగంధతైల ములు శిరోజములకుఁ బూసినను, మేనెల్ల మంటయనుచున్నది; పూఁబాన్పుపై నిదురించుటకు విసుఁగుఁ జెందుచున్నది. ఆభరణముల నేవగించుకొనుచున్నది. వెన్నెలను దుస్సహమనుచున్నది. పిలిచినఁ బలుకుటలేదు; పలికిన మాఱువలుకుటలేదు; మాఱువలికినను, అందు సందర్భశుద్ధి కొఱఁతవడుచున్నది. ఆమె చర్యనుబట్టి చూడఁగా నో ప్రభూ! మన్మథాకారుఁడగు పురూరవునియం దామెచిత్తము హత్తుకొనియుండుట నిక్కువమని తేటపడుచున్నది. నవయౌవనసం పదచే శోభిల్లుచున్న యాయింతి మనోగతమును మీకెఱిఁగించితిమి; మీరు కర్తవ్యము నాలోచింపుఁడు." అని నుడివిరి. సోమదత్తుఁడు భార్యాసమేతుఁడై పుత్త్రికయున్న బంగరుమేడలోనికిఁ బోయెను. " అమ్మా! నీవు యుక్తవయస్కవయితివి; క్షత్త్రియకులోచితమగు స్వయంవరమును నీకుఁ బ్రకటించుచున్నాను; నీవేమందువు?" అని యడిగెను. " జనకా! నాప్రశ్నకుఁ దగిన ప్రత్యుత్తరంబిచ్చు రాకుమారుని నేను పరిగ్రహింతును; కాఁబట్టి స్వయంవరమున నీనియమమును రాజచక్రమునకెల్లఁ బ్రకటింపుఁడు." అనెను. సోమ దత్తమహారాజు వల్లెయని స్వయంవరమహోత్సవాహ్వాన పత్త్రికలు వ్రాయించి, వానిని భరతఖండమునందలి యేఁబదియాఱు దేశముల

నేలు రాజేంద్రులకును బంపించెను. జయప్రదయొక్క సౌందర్య లావణ్యాదులు లోకప్రసిద్ధము లగుటవలన నిర్ణీతదినమున కుచితవేష భాషలతోను, వైభవముతోను, పరిజనులతోను రాజులెల్లరును విశాల నగరమునకు విచ్చేసిరి. ప్రతిష్ఠానపురాధినేతయగు పురూరవుండును కర్ణాకర్ణికగా జయప్రదయొక్క సాటిలేని మేటిసౌందర్యమును గూర్చియు, సద్గుణసంపత్తియు నాలకించియున్నవాఁ డగుటచేత నామె నెట్టులయినఁ బరిగ్రహింపవలయునన్న కుతూహలముతో నుచితగతిని బయలుదేరి విశాలనగరమునకు వచ్చెను. సోమదత్తుఁడు పురూరవ సార్వభౌముని యాగమనమును ముందుగనే చారులమూలమున విని, డెందమునందమందానందము సందడింప మంత్రిపురోహిత సామంత దండనాథులతో నెదురేఁగి తోడ్తెచ్చి యొక సుందరమందిరమున విడియఁజేసెను. మఱునాఁటి యుదయమే స్వయంవరముహూర్త మగుట చేత నగరమెల్లయెడల నలంకరింపఁబడి యింద్రపట్టణమగు నమరా వతిని, కుబేరనగరమగు నలకాపురిని గేలిసేయుచుండెను. ఆరాత్రి కడచినది; తెల్లవాఱినది; జయప్రదాదేవిని చెలులు పన్నీట జలక మాడించిరి; పరిమళద్రవ్యములు పూసి యమూల్యమగు పట్టుచీరం గట్టిరి; బాలసూర్యప్రభాభాసమానములగు ముత్యాలహారములను, మాణిక్యములు పొతకఁబడిన వివిధాభరణములను ధరింపఁజేసిరి. రాజు లెల్లరును దమకుఁ దగినరీతి నలంకరించుకొని స్వయంవరమంటపము నందు నుచితాసనము లలంకరించిరి; పురూరవసార్వభౌముఁడును మన్మథుని ధిక్కరించు చందమున నందమునమీఱుచు నొకభద్రాసన మం దుపవిష్టుఁడై యుండెను. అంతలో సుముహూర్త మాసన్న మగుటతోడనే, మంగళవాద్యములు మ్రోయసాగినవి. భోగకాం తల నృత్యగీతాదులు చెలరేఁగినవి; పురోహితుల మంత్ర వాక్కులు పిక్కటిల్లినవి; రాజన్యుల చూడ్కులు నిగిడినవి. అపుడు

సఖీజనములు తన్నుఁ బరివేష్టింపఁగా మేఘమాలికలనుండి వెలువడిన మెఱపుఁదీఁగవోయన నొప్పుచు జయప్రదాదేవి హస్తమునందుఁ బూదండఁ బట్టుకొని, స్వయంవర మంటపమును బ్రవేశించెను. ఆమె ప్రశ్నమును సోమదత్తుఁడు సభాస్థలి నలంకరించిన రాజులకెల్లరి కెఱింగించెను. దానిని విని కొందఱు ఆకసమువంకఁ జూడసాఁగిరి; మఱికొందఱు కాలిగోటితో నేలనుగీఁటసాఁగిరి; ఇంకను గొందఱు కనులుమూసి ధ్యానమవలంబించిరి. కాని యెవ్వరును దగిన ప్రత్యుత్తర మీయలేక పోయిరి. అపుడు పురూరవుఁడా ప్రశ్నకుఁ దగిన జవాబు చెప్పెను. చెప్పఁగా సభలో జయజయ శబ్దములు వెలువడి మిన్నుముట్టినవి. జయప్రదాదేవి, తన మనసులోని కోరిక నెఱవేరినందుల కింతింతనరాని సంతోషమును బొందుచుఁ బుష్పమాలచే నాపురూరవ సార్వభౌముని కంఠము నలంకరించెను; సోమదత్త మహారాజత్యంత వైభవమున జయప్రదా పురూరవులకు వివాహము జరిపెను. ఆవివాహమహోత్సవమును జూచుటకునుఁ బురూరవ సార్వభౌమునకుఁ గానుకలర్పించుటకును దిక్పతులెల్లరును విచ్చేసిరి; మఱియు నాసమయమున దేవతలు పుష్పవర్షమును గురిపించిరి; దుందుభులు మ్రోయించిరి; అప్సరస లానందాతిరేకముతో నాట్యము సల్పిరి. అష్టదిక్పాలురు నాదంపతులకు శుభప్రదములగు వరములన్నియు నొసంగి, యాశీర్వదించి, అనంతరము తమతమ నెలవులకు వెడలిపోయిరి. రాజులును, పౌరులును, దిక్పతులును, "ఆహా! రూపమునందును, గుణములయందును, సంపదయందును ఈవధూవరు లొకరికొకరు సమానులై యున్నవారు; ఆదర్శప్రాయులై యున్నవారు; వీరిని దర్శించుటకు వేడుకయగునుగదా!" అనుకొనిరి. ఓధర్మరాజా! వినుము—ఆసేతు హిమాచలపర్యంత మలముకొన్న యశశ్చంద్రికతోఁ జెన్నొందుచున్న పురూరవ చక్రవర్తి తన కల్లుఁడయినందులకు సోమదత్తమహారాజు నిర్భరానందమంది, దైవ

మును బ్రశంసించెను ; జయప్రదయుఁ దన యభిప్రాయము ననుస రించియే కార్యము ముగిసినందులకు వేల్పులనెల్ల మ్రొక్కెను ; ఉత్తమ క్షత్రియకన్యయు, రూపమున నసమానయునగు భార్య లభించినందు లకుఁ బురూరవుఁడును హర్షాంబుధినిఁ దేలియాడుచుండెను. దంపతు లిరువురును వివాహానంతరము హృద్యోద్యానవన మధ్యములందును, జంద్రకాంత శిలావేదికలయందును, క్రీడాసరోవరతీరములయందును, నికుంజపుంజములయందును హాయిగా కలిసిమెలసి చరించుచుండిరి. ఈరీతిని గొన్ని దినములు మన్మథారాధనానిమగ్నమానసులై సుఖాను భవంబునఁ జొక్కిరి తరువాత నొక్కనాఁడు పురూరవుఁడుభార్య నుద్దే శించి, "ప్రేయసీ ! నేను ప్రతిష్ఠానపురమును విడిచివచ్చి పెక్కుదిన ములయ్యెను ; అట రాజ్యపరిపాలనాభారమును మంత్రు లెట్లువహించు చున్నారో తెలియకున్నది ; కనుక నేను రాజధానీ నగరమునకు మరల నున్నాఁడ" ననెను. "నాథా ! వివాహమగువఱకుఁ దల్లిదండ్రు లాడుబిడ్డకు రక్షకులగుదురు ; వివాహానంతరము సతికిఁ బతియే యేడు గడ ; మీపాదముల నాశ్రయించి యుండుటయే నాకుఁ బరమానంద హేతువు ; నేనుగూడ మీతో వచ్చుచున్నాను." అని మృదుమధుర స్వరముతో జయప్రదాదేవి మాఱువలికి, జననీజనకులకుఁ దన యభీష్ట మెఱిఁగించెను. తమ గారాబు కొమరితను విడువవలసి వచ్చినందులకు వారెంతయుఁ జింతించిరి ; ఆమెకుఁ జెప్పవలసిన ధర్మములెల్లఁ జెప్పిరి. ప్రయాణమునకు నిశ్చయింపఁబడిన శుభముహూర్తమునందు ధనకనక వస్తువాహనాదులను, దాసదాసీజనములను గూఁతువెంటఁ బంపుచు నల్లునికిఁ జెప్పవలసినవెల్లఁ జెప్పి, సోమదత్తమహారాజు పురబాహ్య ప్రదేశమువఱకు వారిని సాగనంపి, పిమ్మటఁ దన నగరునకు మరలెను. పురూరవసార్వభౌముఁడు నదీనదాబ్ధి పృథ్వీధరఘోర వనాళులంగడచి కతిపయదినంబులకుఁ బ్రతిష్ఠానపురముంజేరెను ; మంత్రి పురోహిత

సామంత పౌరప్రముఖులెల్లరును బ్రభుదంపతులకు బ్రహ్మాండమగు స్వాగతమొసంగిరి ; నగరము నలంకరించిరి. పురూరవుండును భార్యతో రాజమందిరముంజొచ్చి మహానందముతో నుచితదానములచే నెల్లరను దృప్తిపఱచెను. అనంతరము జయప్రదాదేవితో సర్వసౌఖ్యము లనుభవించుచుఁ మన్మథుని గర్వము సర్వము హరించుచుఁ బ్రజానురంజకముగాఁ దన యేలుబడిని సాఁగించుచుండెను.

## —♦ శనైశ్చరుఁడు పురూరవునితో భాషించుట. ♦—

భూమండలమున నింద్రునిమించిన మహావైభవముతోను, ఖ్యాతితోను పురూరవ సార్వభౌముఁడు చెన్నొందుచుండుట సూర్యపుత్రుఁడగు శనైశ్చరుఁడు తెలిసికొనెను ఆరాజేంద్రునకుఁ దన ప్రభావము నెఱిఁగించి లొంగఁదీయవలయుననుకొని యాతఁ డొక్కదినమున బ్రాహ్మణవేషము ధరించెను ; ఒకచేతఁ బొత్తముఁబట్టెను; వేరొకచేతఁగలశము నుంచుకొనెను ; హస్తములందు సువర్ణ కంకణములును, కర్ణములందుఁ గుండలములును సువర్ణకాంతు లీనుచుండఁగా, మేనిఁగప్పిన కాశ్మీర శాలువా వింతసోయగము గూర్చుచుండఁగా, మూర్తీభవించిన వేద కదంబమోయనునట్లు లొప్పుచు, శనైశ్చరుఁడు బయలుదేరి పురూరవుని కొలువుకూటమునకు విచ్చేసెను ; ఆతనిం జూచినంతనే సభాసదులెల్లరు అచ్చెరువొందిరి. ఆస్థానపండితులు, భువికవతరించిన బృహస్పతి యనుకొనిరి. పురూరవుండా కపటబ్రాహ్మణున కెదురేఁగి తోడ్తెచ్చి, యుచితపీఠమున సుఖాసీనుంజేసి యర్ఘ్యపాద్యాదులచేఁబూజించి, అంజలిఘటించి, “ దేవా ! ఏదేశమునుండి వచ్చుచున్నారు ? ఏకార్యమును దలఁపెట్టి వచ్చుచున్నారు ? మీనామముచేఁ బవిత్రీభూతములయిన దివ్యాక్షరములేవి ? ” యని సవినయముగఁ బలికెను. బ్రాహ్మణవేషముతోనున్న శనైశ్చరుఁడు మందహాస మొనరించి, రాజుంజూచి యి

ట్లనెను. "ఓపురూరవ సార్వభౌమా! నీవు భూపురందరుఁడవు; ఏఁబది యాఱు దేశములనేలు రాజన్యుల మూర్ధములందుండువాఁడవు; ధర్మ పరాయణుఁడవు; నీకీర్తిలతలు పదునాల్గు భువనముల కెగఁబ్రాకు చున్నవి. నేను దేవలోకమునందుండువాఁడను; దేవతలు, దానవులు, యక్షకిన్నర కింపురుష గరుడ గంధర్వసిద్ధసాధ్య ప్రముఖులు, మర్త్యులు మున్నగు వారందఱును నాకు లొంగినవారే! అంతేకాదు. నాపేరు విన్నమాత్రాన భయపడుదురు; నీకడ దాఁపరికమెందులకు? నాపేరు శనైశ్చరుఁడు; నేను సూర్యపుత్రుఁడను." అని శనైశ్చరుఁడింకను దనమాట ముగింపకుండఁగనే, రాజేంద్రుఁడు వ్యాకులిత మనస్కుఁ డయ్యెను; కాని యంతలోనే, మహాజ్ఞాన సంపన్నుఁడగుటచేత ధైర్య మవలంబించి, విన్నఁదనమును మోమునఁ దోఁపనీయక, మందహాసింత వదనారవిందుఁడై, కేల్మోడ్చి నమస్కరించి, "ఓసూర్యపుత్రా! మహానుభావా! ఈభృత్యునివలన మీకుఁ గావలసిన పనియేమున్నది? ఆనతిండు." అనెను. "రాజా! నీకు నామహిమ వ్యక్తముసేయుటకు నిశ్చయించుకొంటిని. నిండుజవ్వనములో నీపై విజృంభింపుమందువా? లేక, వృద్ధాప్య మలమినపిమ్మట నీపై విజృంభింపుమందువా? చెప్పుము." అని శనైశ్చరుఁడు నుడివెను. ఆవాక్యములు సభాస్థలి యందున్నవారికి గర్భనిర్భేదకము లయినవి. కాని, పురూరవుండు కలఁ గలేదు. "స్వామీ! ఏదశయందు నాపై మీరు విజృంభించినను, మీయనుగ్రహమే నాకంగరక్ష కావలయునుగదా! అట్టిచో నెపుడయిన నేమి? మీరడిగితిరి కనుకఁ జెప్పుచున్నాను. ప్రత్యక్షనరకమయిన వార్ధకమునందు మీదాడికీ భృత్యుఁడు సహింపఁజాలఁడు; యౌవనదశ యందే మీరు వీనిని బరీక్షింపుఁడు." అని యమ్మహీజాని బదులు చెప్పెను. అందుల కంగీకరించి శనైశ్చరుఁడు రాజుకడ సెలవుఁ గైకొని వెడలిపోయెను; కాని—నిష్ఠాగరిష్ఠుఁడును, సదాచారసంపన్నుఁడును

నగు పురూరవ సార్వభౌమునిలోఁ బ్రవేశించు వెరవుఁగానక యాతఁడు విచారించుచుండెను.

—♦ శనైశ్చరుఁడు పురూరవుని రాజ్యభ్రష్టునిఁజేయుట. ♦—

శనైశ్చరుఁడు దన ప్రభావమువలనఁ గ్రూరమృగ సంతానమును గల్పించెను. ఆజంతువులు పురూరవుని రాజ్యమునఁ జొరఁబడి పల్లీ పట్టణములందున్న ప్రజలకును, పశువులకును, పైరులకును హాని గలిగించుచుండెను. పౌరులెల్లరును, "ఎన్నడులేని జంతుపీడ యీనాఁడెట్లు కలిగినద" నితమలోఁ దాము విచారించుచు మహారాజు నొద్దకుఁ బోయి, నమస్కరించి తమకుఁగలిగిన ముప్పును విన్నవించిరి. సర్వజ్ఞుడగు నమ్మహీపతి యది శనైశ్చరుని మహిమగావచ్చునని మనస్సులో ననుకొని, మందహాసాంచిత వదనారవిందుఁడై, పౌరుల నవలోకించి, "మీరు మీమీ గృహంబులకరిగి నిశ్చింతతో నుండుఁడు; మేము త్వరలోనే తగిన పరివారముతో బయలుదేరివచ్చి, వన్యమృగములను జెండాడుదుము." అని యభయప్రదాన మొనరించి, వారిని వీడ్కొలిపెను. పౌరులు నిష్క్రమించిన కొలఁది దినములలోనే పురూరవ సామ్రాజ్యముయొక్క సరిహద్దులలో శత్రువులు సైన్యముతోవచ్చి విడిసిరని చారులు తెలిసికొని, మంత్రుల కెఱిఁగించిరి. ఆవార్తను మంత్రులుతొలుత నమ్మలేకపోయిరి. "ఔరా! నిప్పునకుఁ జెదపట్టుటెందయినఁగలదా? ప్రతాపశాలియగు పురూరవ మహారాజుగారి మాటకు బదులుసెప్పువాఁడింతవఱ కేలోకమునందును లేఁడే! వారి యాజ్ఞ దేవతలకుఁగూడ గౌరవనీయమై యుండెడిదే! ఇదేమివింత! ఇప్పుడు శత్రువులీ రాజ్యముమీఁది కెట్లు దండెత్తి రాగలుగుచున్నారు? ఇదియంతయుఁ గాలవైపరీత్యమా? అని విచారించిరి. పురూరవుండు సపరివారముగ నరణ్యమునకుఁబోయి ప్రజాపీడం గలిగించుచున్న

దృష్టమృగ సందోహములను నిశ్శేషముగాఁజెండి, నగరునకుఁ దిరిగి వచ్చెను. అమ్మహీజాని సింహాసనాసీనుఁడై యున్నతఱిని మంత్రులు కేలోడ్చి సవినయముగ నిట్లు విన్నవించిరి. “మహాప్రభూ! పులి మీఁదికి పిల్లి ఉఱుకనున్నట్లు, సింహమును చీంబోతు అడ్డగింపనున్నట్లు, ఏనుఁగును కుక్క తఱుమఁ జూచినట్లు, ప్రజ్వలితాగ్ని కణములకుఁ జెదపట్టినట్లు, అసమాన ధైర్యశౌర్య సాహసౌదార్యాది సద్గుణ గణ గరిష్ఠులరగు మిమ్ములను శత్రుసైన్యములు ముట్టడింపనున్నవని యెఱిఁగించుటకు విచారింపవలయునో, విస్మయ మందవలయునో మాకుఁ దెలియకున్నది; మున్నెన్నఁడు లేని యీసాహస మీనాఁడెట్లు కలుగనున్నదో మాకుఁ దెలియకున్నది. దేవా! ఇపుడు కర్తవ్యమేది? శత్రువులు రాజధానీ నగరమును బ్రవేశింపకముందే, కార్యనిరూపణమునకుఁ గడంగవలయును.” మహారాజు మంత్రులవచనము లాలకించి, మందహాస మొనరించెను. శత్రువుల దాడికి శనైశ్చరుని మహిమయే హేతువని గ్రహించెను. “మంత్రులారా! శివునాజ్ఞ లేనిదే చీమయినఁ గుట్టదను సామెత మీరెఱింగినదేకదా! వైరులు మనరాజ్యముపై దండెత్తనున్నయెడల వారి యాగమనమునకు ఈశ్వర సంకల్పమే కారణమగును. భగవదిచ్ఛ యెటులున్న నటులు కార్యములు జరుగుచుండును; పురుషకార మెన్నటికిని ఫలింపదు; కనుక సమర సన్నాహములుమాని, మీరు ప్రశాంత చిత్తములతో నుండుఁడు.” అని యాతఁడు బదులుచెప్పెను. మంత్రులు మారు వలుకలేకపోయిరి. తరువాత బురూరవుఁడు క్షణకాలము నిమీలిత నేత్రుఁడై యాలోచన మభినయించి, పిమ్మటఁ గనులు తెఱచి వారితో, “మనరాజ్యమునందు వివిధ నేరములకుఁగాను శిక్షింపఁబడి బందిగములందుంపఁబడిన ఖైదీల నెల్లరను విడిచిపుచ్చుఁడ” నిచెప్పి, యంతఃపురమున కరిగెను. ఆయాజ్ఞకు మంత్రులును, పౌరులును దద్దయు సంతసించిరి. మహారాజు

యొక్క ఔదార్యమును వేవిధములఁ బ్రశంసించిరి. మఱునాఁ డుచితములయిన కానుకలను సమర్పింపవలయుననుకొనిరి. అంతఃపురముం జేరఁబోయిన పురూరవుండు, రాత్రి కాఁగానే పడకటిల్లు సొచ్చి నిద్రించెను. నిద్రాసమయమున నేదియో కలఁగని యులికిపడిలేచెను. చెంతనే నిదురించుచున్న భార్యలేచి, ప్రాణనాథుని సమాశ్వాసించి, "హృదయేశ్వరా! ఏమిది? ఉలికిపడితి రేల?" యని యడిగెను. "ప్రాణేశ్వరీ! మనము వేటకుఁబోయినట్లును, అరణ్యమునం దొకచోట నొకలేఁడి కనఁబడినట్లును, ఆలేఁడి తనభర్తను, బిడ్డలను బాసి వివిధస్థలములకుఁ బోయి, కష్టములనుభవించినట్లును, కడపట నాలేఁడి దంపతులు దమబిడ్డలంగూడి సుఖించినట్లును, ఈ విచిత్రసంఘటనము లెల్ల మనము కన్నులారఁ గాంచినట్లును కలగంటిని సుమీ!" యని మహారాజనెను. "ఆర్యపుత్రా! ధైర్యముచేత మేరుపర్వతమును డీకొనునట్టి శక్తి మీకుఁగలదు; స్వప్నమునందు గోచరించిన విషయములకుఁ గలఁగనేల? చిత్తమును శాంతియుతము గావించుకొనుఁడ" ని జయప్రదాదేవి భర్తతో నుడివెను; కాని యాతనికి, శనైశ్చరుని ప్రభావమువలనఁ జిత్తశాంతి కుదురలేదు. అతఁడు భార్యతో నిట్లనెను. "ప్రాణేశ్వరీ! శత్రుసైన్యము లిపుడు మనరాజ్యపు సరిహద్దులలో నున్నవి. మన దినములు వక్రములై యున్నవి. కాలము మంచిది కానపుడు బంగారము చేతఁబట్టిన మట్టియగును; కాలము మంచిదై యుండెనా, మట్టి ముట్టిన బంగారమగును; మనకుఁ గాలగతి వక్రించుటచేత శత్రువులను మార్కొని యుద్ధముసేయుట తగదు. అట్లు చేసినయెడల నోటమి సంభవించును; ఉత్తమక్షత్రియునకుఁ బరాజయముకంటెను బ్రాణసంకట మింకొకటిలేదు. కాఁబట్టి నాపూనికను వినుము. మనమీ యర్ధరాత్రమున సామాన్యజనుల వేషములతో బిడ్డలను జంకనిడుకొని, కావలివారి కన్నులఁబడకుండ నగరును విడిచి

యే మాఱుమూల పల్లెకో పోవలయును. కాలము మంచిదగునంత వఱకుఁ బ్రజలమోములఁ జూడరాదు ; పూలనమ్మినచోటఁ గట్టె లమ్ముటకు మనమంగీకరింపదు. ఇందులకు నీవేమందువు ?" అని పురూరవుండు భార్యతో ననెను. జయప్రదాదేవి యాపలుకు లాలకించి, కలఁతఁబొందక, విచారింపక మందహాసముతో, "ప్రాణనాథ ! మీయభీష్టమే నాయభీష్టము ; మీ పాదసేవ తప్ప నేను గాంక్షించునది వేఱేదియునులేదు. అయ్యది లభించుటకొఱకే నేను సర్వదా భగవంతునిఁ బ్రార్థింతును. నగరునందున్నను, అడవి యందున్నను మిమ్ములఁ బాయకుండనున్న నాకుఁ జాలును ; మీయిష్టానుసార మొనరింపుఁడ" నెను. తరువాత నాదంపతు లిరువురును రాజలాంఛనములను, దుస్తులను విడిచి, బీదలుకట్టు చినిఁగినబట్టలం గట్టుకొనిరి. నిదురించుచున్న బిడ్డలకుసైత మట్టిబట్టలనే కట్టిరి. భార్యాభర్త లిరువురును జెరియొకబిడ్డను జంకయందిడుకొని, గుఱ్ఱపుశాలగుండ నొరులకంటఁ బడకుండ నాయర్ధరాత్ర సమయమున నగరువిడిచి, యరణ్యమునకుఁ బట్టు మార్గము ననుసరించి పోయిరి.

### — పురూరవచక్రవర్తి కూలిపనిచేయుట —

పురూరవుం డాలుబిడ్డలతో బహుదూరము నడచిపోయెను. అంతలోఁ బ్రభాతమయినది ; సూర్యుని లేఁతకాంతులు జగముల నలుగడల నలముకొనుచున్నవి ; పక్షులు తమ గూళ్లువిడిచి ప్రయాణమును సాఁగించుచున్నవి ; కొలనులలోని తామరలు నగుమోములతోఁ దలసూపుచున్నవి; రాజా సమయమున నరణ్యమునకు సమీపమందున్న సోమపురమను పట్టణమును జేరుకొనెను. ఆ నగరమునకుఁ బొలిమేరయందున్న యొకసరోవరతీరమునఁ బ్రయాణమువలనఁ గలిగిన బడలికయు, రాత్రినిద్ర లేమివలనఁ గలిగినబద్ధకమును బోవుటకుఁగాను

రాజు, జయప్రదాదేవితోను, బిడ్డలతోను కొంచెముసేపు విశ్రమించెను. బిడ్డల కాఁకలిబాధ యధికమగుటవలన వారోర్వఁజాలక, బిగ్గఅగా నేడ్వసాగిరి. అంతలో దగ్గఱగానున్న పొలములలోఁ బనులు చేయుటకు వచ్చిన కూలివాండ్రా శిశువులరోదన మాలకించి, పరుగు పరుగునఁ జెరువుగట్టునొద్దకు వచ్చి యట మహాతేజస్సంపన్నుఁడై క్రాలుచున్న పురూరవుని రూపలక్షణాదులకు నక్కజపడి యిట్లు ప్రశ్నించిరి. "అయ్యా! మీరెవ్వరు? ఎందుండి వచ్చుచున్నారు? ఎక్కడి కేఁగనున్నారు?" ఆ ప్రశ్నలకు మాఱువేషముతోనున్న పురూరవమహారాజు సవినయముగా, "అయ్యలారా! నేను ప్రతిష్ఠాన నగరమును బాలించు పురూరవసార్వభౌముని యాస్థానమునందు లేఖకోద్యోగము సేయుచుండెడివాఁడను. అమ్మహారాజు రాజ్యము శత్రుహస్తగతమగుటచేత మావంటివారికట నాశ్రయము దుర్లభమయినది. అందువలన నే నాలుబిడ్డలతో నారాజ్యమునుండి బయలుదేరి వచ్చితిని." అని బదులుచెప్పెను. కూలివాండ్రా పలుకులాలకించి జాలిపడిరి. "అయ్యా! నీవు వేఱుతావునకుఁ బోవలసిన పని లేదు. మాయిండ్లకు దగ్గఱగా నీకు నివసించుటకొక యిల్లుకట్టి యిచ్చెదము. నీకును, ఆలుబిడ్డలకును, అన్నవస్త్రములకు లోపములేకుండఁ జూచు భారము మాపైనున్నది. నీవు మాతోఁబాటు కష్టపడి పని చేయుచుండుము." అని వారనిరి. మహారాజు తనకారీతిని జీవనోపాధి కలిగినందుల కెంతయు సంతోషించి, వారికిఁ దనకృతజ్ఞతను దెలిపెను. కూలివాండ్రు పురూరవుని భార్యాపుత్త్రులతోఁగూడఁ దమగ్రామమునకుఁ గొనిపోయి, యొకగృహమును నిర్మించి యందువసింపఁజేసిరి. పురూరవుండు నాఁడు మొదలుకొని కూలివాండ్రలోఁ దానొక కూలివాఁడయ్యెను; పగలెల్లఁ జెమటూర్చి పాటుపడుచుండెను; కూలి

డబ్బులతోఁ బొట్టను నోముకొనుచు నాలుబిడ్డలను బోషించుకొను చుండెను. ఈవిధముగా కొన్నిదినములు గడచినవి.

## —♦ నవకోటినారాయణ వృత్తాంతము ♦—

ఆనగరమున నవకోటినారాయణ యనువైశ్యశిఖామణి యొకఁ డుండెను; ఆతఁడు తొమ్మిదికోట్లరూపాయలకుఁ బడగయెత్తి యా పేరుతో వ్యవహరింపఁబడుచుండెను; కాలవైపరీత్యమువలన నారాయణ శ్రేష్ఠియొక్క వ్యాపారము నానాఁటికి క్షీణించుచుండెను; ఏపనిచేసి నను వానికి ధననష్టమే కలుగుచుండెను. అందువలన నాతఁడు గొప్ప జ్యోతిష్కుని రావించి తనస్థితిగతులను జెప్పెను. ఆ జ్యోతిష్కుఁడు నారాయణశ్రేష్ఠియొక్క గ్రహబలములను విచారించి, "అయ్యా! నీకిప్పుడు దుష్టగ్రహప్రాబల్య మధికముగానున్నది; ధనక్షయమున కదియే హేతువగుచున్నది; ఆ దుష్టగ్రహముల పీడ నివారింపఁబడు టకు నీవు సమస్తవిధములయిన దానధర్మములు సేయవలయును; ఆరామములు, ఆలయములు, తటాకములు, నూతులు, బావులు మున్నగువానిని నిర్మింపవలయును. అట్లు చేసినయెడల నీ కెప్పటియట్లు లాభములు కలుగుచుండును." అనెను. నారాయణ అట్లుచేయ నంగీ కరించి, కూలీల పెద్దను బిలిపించి, చేయవలసిన పనులుచెప్పెను. అప్పు డామేస్త్రి, "అయ్యా! శ్రేష్ఠిగారూ! మాతోఁబాటు లెక్కలు వ్రాయు మాయుద్యోగికిఁ గూడ సమానముగ మీరు కూలి నీయవల యును." అనిచెప్పి, యాతని యంగీకారముమీఁద మొత్తము సొమ్ము నిర్ణయించుకొని ఆరామాదులను గుత్తించి, జట్టువాండ్రతోఁ బనిచేయు చుండెను. మాఱువేషముతోనున్న పురూరవుఁడు వారమున కొకపర్యా యము కూలివాండ్రకు రావలసినపైకము సరిగా లెక్కించుచు, వారితోఁబాటు దానుగూడ సమానముగా కూలిని గొనుచుండెను

ఇట్లుండఁగా నమ్మహారాజు భార్యయగు జయప్రదాదేవికి మానభంగము గలిగింపవలెనని శనైశ్చరుఁడు కృతనిశ్చయుఁ డాయెను; అతఁడు నవకోటినారాయణశ్రేష్ఠియొక్క చిత్తమునఁ బ్రవేశించెను. అతని బుద్ధిని ద్రిప్పివైచెను; నారాయణశ్రేష్ఠి యొకటి రెండుపర్యాయములు తన మేడయొక్క పైయంతస్తుమీఁద నిలువఁబడి జయప్రదాదేవియొక్క సౌందర్యలావణ్యాదుల నవలోకించి యాశ్చర్యముపొందెను; ఆమె నెట్టులయిన ననుభవింపవలయునన్న దుశ్చింతవానికిఁ గలిగినది. ఆ కోరికను నెఱవేర్చుకొనఁగోరి, కూలీల మేస్త్రితో "ఇఁకమీఁద డబ్బు వసూలుచేసికొనుటకు మీరు రావద్దు. మీ యింటి యాఁడువాండ్రను బంపుచుండుఁడ" నెను. అట్లు చెప్పుటలో నావర్తకున కేదియో దురభిప్రాయమున్నదని యామేస్త్రి గ్రహించెను; కాని యేమిచేయుటకును శక్తుఁడు గానందువలన మాఱు వలుకక యందుల కంగీకరించెను; నాఁటినుండి కూలివాండ్ర భార్యలే సొమ్ముపుచ్చుకొనుటకు నారాయణశ్రేష్ఠిగారి ధనాగారమునకుఁ బోవుచుండిరి. నారాయణశ్రేష్ఠి తనషరాబునుబిలిచి రహస్యముగా నిట్లనెను. "కూలీల లెఖకునిభార్య కూలికొఱకు వచ్చినయెడల నీకూలి శ్రేష్ఠిగారి భవనములోనున్నది పొమ్మనిచెప్పి, నా పడకటింటికిఁ బంపి యామె యందుఁబ్రవేశించుటతోనే మీరు తలుపు బిగించిపొండు. షరాబువల్లె యనెను. ఆనాఁటి సాయంకాలమే జయప్రదాదేవి తన భర్తకు రావలసిన కూలితెచ్చుటకు శ్రేష్ఠిగారి ధనాగారమునకుఁ బోయెను. ధనాగారమునందున్న షరాబును ఆమె కూలి యడుగఁగా, "అమ్మా! నీభర్తకు రావలసిన పైకము శ్రేష్ఠిగారియొద్ద నున్నది; వారు భవనములో నున్నారు; రమ్ము; నేను దీసికొని వెళ్ళెదను." అని యామెన వెంటఁబెట్టుకొని, తన యజమానియొక్క శయనాగారమునొద్దకు దోడ్కొనిపోయి, బలవంతముగా లోనికిఁద్రోసి, బయటఁ దలుపు

మూసి, తనపని ముగిసినదని శ్రేష్ఠిగారితోఁ జెప్పుటకుఁ బోయెను. జయప్రదాదేవికి, పడకటింటిని జూచుటతోనే సంగతియంతయును దేటపడినది ; శ్రేష్ఠియొక్క దురభిప్రాయము బోధపడినది ; షరాబు యొక్క కుతంత్రము స్పష్టపడినది. ఆమె చేతులుమోడ్చి భగవంతుని మనమున ధ్యానించుకొని "పరమేశ్వరా ! నాభర్త సత్యసంధుఁడును, ధర్మపరాయణుఁడును, నిశ్చలభక్తుఁడును అగుచో, నేను పతివ్రత నగుచో నాకిప్పట్ల మానభంగమొదవకుండఁ గాపాడుము." అని యామె గదిని నలుగడలఁ బరికించెను. అందొకమూల నాలుగు గజముల పొడవును, రెండు గజముల వెడల్పునుగల మందస మొండామెకు గనఁబడెను. తోడనే దానిమూతను దెఱచి లోనఁ బ్రవేశించి, పార్వతీదేవిని ధ్యానించి, "తల్లీ ! మనోవాక్కాయ కర్మములచేత నెల్లవేళల యందు భర్తృపదారవింద సంసేవనాభిలాషతో మనుచున్న పవిత్ర చరిత్రనగుదునేని, యీపెట్టె నాభర్తకుఁదక్క యితరులకుఁ దెఱువఁబడకుండు నట్లను గ్రహింపుము ; మఱియు నగ్నిచేతఁగాని, జలముచేతఁగాని, వాయువుచేతఁగాని, లోహవిశేషాదులచేతఁగాని దీని కుపద్రవము వాటిల్లకుండు నట్లను గ్రహింపుము. నేనిందెంత కాలము వసింతునో, అంతదనుక నాకాహార నిద్రాపానీయాదు లక్కఱలేకుండు నట్లనుగ్రహింపుము." అనెను. పార్వతీదేవి, తన భక్తురాలగు జయప్రదాదేవియందు సుప్రసన్నురాలై యదృశ్యరూపముతోనే, "సాధ్వీ ! నీవు విచారముడుగుము ; నీకోరిన కోర్కెలెల్ల సిద్ధించున"ని నుడివెను. పెట్టెమూత దానంతట నదియే మూసికొనెను. జయప్రదాదేవి లోన సురక్షితయై యున్నది. తరువాతఁ గొంతసేపటికి షరాబువలన నవకోటి నారాయణ, సౌందర్యరాశియగు గణికుని భార్య పడకటిల్లు చొచ్చినదని యాలకించి యత్యంతానందమంది, పరిమళద్రవ్య మిళితములగు వలువలుదాల్చి, తాంబూలముసేవించి ఠీవిగా నడుచుచువచ్చి

శయనాగారము తలుపు తెఱచెను; తాను లోనఁ బ్రవేశించి, తన వెనుకతలుపు మూసెను; ఆతఁడు గదిని నలుదిక్కులందుఁ బరికించెను; కాని జయప్రద కంటఁబడలేదు. "హా! ప్రేయసీ! మోహనాంగీ! నాతోఁ బరిహాస మాడుచున్నావా? మన్మథబాధకుఁ దాళఁజాలక, తపించుచున్న నన్ను విలపింపఁజేయుట కెందుదాగియున్నావు?" అని మోహావేశముతోఁ బిచ్చిపిచ్చి మాటలాడుచు గదిగోడలయందలి గూళ్ళను, అటనున్న బీరువాలను, మంచముక్రిందను వెదకెను; ఎక్కడ వెదకినను, ఆమె కనఁబడనందునఁ దత్తరమంది, "అయ్యో! ఇదేమి మాయ! ఈగదికి వేఱుమార్గము లేదుకదా! షరాబు ఆమె నిందుఁ బ్రవేశపెట్టెనని చెప్పినాఁడు; వానిమాట లబద్ధములుకావు; అయిన నామె యేమయినది? గవాక్షముగుండఁ బోయినదని చెప్పుటకా దానికి బిగించిన యినుపయూచ లటులనేయున్నవి! ఇదేదియో గారడి వలె నున్నదే!" యనుకొనుచు మందసమును సమీపించెను. అది మూసియుండుటనుజూచి, "ఓహో! తెలిసినది; తెలిసినది. ఆసుంద రాంగి యీపెట్టెలోదూరి మూఁత వేసికొన్నది. అయిన నేమాయె? నన్నుఁ దప్పించుకొని యెక్కడకుఁ బోఁగలదు? పనివాండ్రచేత దీని నిప్పుడే బ్రద్దలు చేయింతును." అని నారాయణశ్రేష్ఠి రహస్యముగా పదిమంది సేవకులను పిలిచి, "మీరీ మందసము మూత నెటులయినఁ దెఱువుఁడ" నెను. వారనేక విధములఁ బ్రయత్నించిరి. తుదకు విసిగి, వేసారి, పదునైన గొడ్డళ్లు చేఁబూని రెండు మూఁడు గంటలసేపు మొత్తిరి. వారి రెక్కలు ముక్కలయినవి; గొడ్డళ్ళు తుత్తునియ లయినవి; కాని పెట్టె చెక్కుచెదరలేదు. "బాబూ! ఇదేదో మాయ వలె నున్నది; కాకున్న మాశ్రమయంతయును వమ్మగుటయేమి? ఇఁక మావలన నీపని కాదనిరి. నారాయణశ్రేష్ఠికి వ్యాకులత యధిక మయినది; తన భార్యకొఱకు వెదకికొనుచు గణికుఁ డచ్చటికి వచ్చిన

యెడలఁ దన మోసమంతయు వెల్లడియగుననియు నందువలనఁ బేరు ప్రతిష్ఠలకు భంగము కలుగుటమాత్రమేకాక, రాజదండన సైతము కలుగుననియుఁ దలంచి భయపడుచుండెను. అపుడు సేవకులలో నొకఁడు "దీనికి నిప్పుపెట్టుట మంచిద" నెను. ఆసలహా యుక్తముగ నున్నదని శ్రేష్ఠి యాపెట్టెను మాత్రమేకాక, ఆయింటినే పూర్తిగా తగులఁ బెట్టుఁడని సేవకుల కాజ్ఞాపించెను. వారు తైలాదులు గృహోపరిభాగమునఁబోసి నిప్పు పెట్టిరి; క్షణములోఁ జిటపెటార్భటులతో భయంకర జ్వాలలు నలుగడల నలముకొని యాగృహమునుమాత్రమే కాక, ఆవీథి యందున్న యిండ్ల నన్నిటిని దహించివైచెను; అయిన నేమి! మందస మెప్పటియట్లే యున్నది. మీఁదుమిక్కిలి యది గోరువెచ్చగానయిన లేదు. "హా! భగవంతుఁడా! ఇఁకేది దారి? ఈమెను బొందవలయునన్న దుర్బుద్ధి నావినాశమునకుఁ గలిగినదాయేమి? గొడ్డళ్లతోఁ బగులఁగొట్టించిన నీపెట్టె పగులలేదు; పెనుమంటలలోఁ బడవేసినను వేఁడెక్కక, చల్లగానున్నది. ఇందేమి వింతయున్నది?" అని శ్రేష్ఠి యాలోచించుకొని, చివరకు దానిని సముద్రమధ్యమునఁ ద్రోయించుటకు నిశ్చయించుకొనెను. అతఁడు తన సరకులను విదేశములకుఁ గొనిపోవుటకు నాఁడే యొకయోడ పయనము కానుండుటచేతఁ గూలివాండ్రచేత నాపెట్టెను సముద్రతీరమునకుఁ జేర్పించెను. ఆయోడ మీఁదనా మందసము నెక్కించి సముద్రమధ్యమునకుఁ బోయినపిమ్మట దానిని నీటిలోఁ ద్రోయించుటయే వాని సంకల్పము. ఆసమయమునఁ బేటికయందు సురక్షితమైయున్న జయప్రదాదేవి, గొంతెత్తి, "ఓసెట్టీ! ఏల నన్ను సముద్రమధ్యమునఁ బడద్రోయఁజూచెదవు? నీకోరిక ఫలింపదు—నేనున్న యీపెట్టె నీటియందు మునుఁగదు. కనుక నట్టి ప్రయత్నమును విరమింపుము. ఏడు సంవత్సరములవఱకు నితరులకంటఁ బడకుండుటయును వ్రతమొండు నాకున్నది. వ్రత

సమాప్తి యయినఁగాని నేను బయటకు రాఁజాలను." అనెను. నవకోటి నారాయణశ్రేష్ఠి యాపలుకు లాలకించి విస్మయమందెను ; ఆపలుకులకు వ్యతిరిక్తముగా నాచరించినయెడలఁ దనకేమి ముప్పు వాటిల్లునోయని మిక్కిలి భయపడెను. పెట్టె నోడమీఁది కెక్కింపక, సముద్రతీరము నందొక వటవృక్షచ్ఛాయనుంచి, తన నగరమునకుఁ దిరిగి పోయెను. పెట్టెలోనున్న జయప్రదాదేవియు భర్తృవియోగమునకును, పుత్త్రవియోగమునకును సంతాపమునుజెందుచుఁ జేయునది లేక సర్వదా భగవంతుని ధ్యానించుచుండెను" అని శ్రీవేదవ్యాస మునీంద్రుఁ డెఱిఁగింపఁగా ధర్మనందనుం డమ్మహాత్ము నవలోకించి, "పూజ్యుఁడా ! ఆవలికథ నెఱిఁగింపుము" మని కుతూహలాయత్తచిత్తుఁడై వేఁడుకొనెను. అప్పుడు వేదవ్యాసుఁడు మరలఁ జెప్పఁ దొడంగెను.

## —♦ శనైశ్చరుని మహిమవలనఁ బురూరవుఁడు పుత్త్రుల నెడఁబాసి గొఱ్ఱెలకాపరి యగుట. ♦—

ఓ ధర్మరాజా ! వినుము. కూలిఁదెచ్చుటకుఁ బోయిన భార్య యెప్పటికిని గృహమునకుఁ దిరిగిరాకున్నది ; కారణమేమో విచారింతమని పురూరవుఁడు బయలుదేరి, నవకోటినారాయణశ్రేష్ఠి యింటికిఁ బోయెను. అటనున్న ద్వారపాలకులను బ్రశ్నించెను. వారు, "అయ్యా ! మీకు రావలసిన పైకమును శ్రేష్ఠిగారు తమభవనమునందుంచిరి. అపుడామె దానికొఱ కక్కడకుఁ బోయినది. తోడనే యాభవనమునందు భయంకరములయిన మంటలెగసినవి. ఆవృత్తాంతమాలకించి శ్రేష్ఠిగారు విచారించి, అవిచారముసహింపజాలక, కర్పూరద్వీపమునకు వెళ్లిరి." అనిచెప్పిరి. ఆపలుకులు, పాపము ! పురూరవుని చెవులకు ములుకులయినవి. అతఁడు క్రుంగిపోవుచున్న హృదయభారముతో మాఱుమాటాడక వెంటనే గృహమునకు మరలెను. "హా !

పరమేశ్వరా! ఇదేమి మాయ! ఇదేమికష్టము! కలయందయినఁ బరుల కపకృతి సలిపియెఱుంగని నాకేల నీయగచాట్లు! రాజ్యము పోయినది! సుఖములు దూరములయినవి! కూలిచేసికొని బ్రదుకు దుర్గతి దాపురించినది. ఇన్నిటికిఁ దలయొగ్గి నిన్ను నమ్మికొనియుండఁగా నీ విపత్తేమి? కటకటా! భార్యలేని బ్రదుకు వ్యర్థముకదా! క్షణ మాత్రమయిన నన్ను విడిచియుండఁజాలని నాయర్ధాంగి నెడఁబాసి నేనెట్లు జీవింపఁగలను? "అమ్మా!" యని మాటిమాటికిఁ బిలుచు నీబిడ్డల కేమి సమాధానమీయఁగలను?" అనియిట్లు తద్దయుం బెద్దప్రొద్దు ఆతఁడు చింతించి చింతించి, కడకు ధైర్యమవలంబించి, బిడ్డల నిరువురను రెండుభుజములమీఁదఁ గూరుచుండఁ బెట్టుకొని తన భార్యనుగుఱించి విలపించుచు, మనస్థైర్యములేమి, అరణ్యమార్గమును బట్టి బహుదూరము పోయెను అంతలో శనైశ్చరుని ప్రభావమువలన మార్గమధ్యమందున్న యొకనది వెల్లివిరిసి దుస్తరమైయుండెను. పురూరవుఁ డాభయంకర ప్రవాహమునుజూచి, హా! సతిని విడిచి బ్రతుకుటకంటె నిందుఁబడి మరణించుట మేలుగదా!" యనుకొనెను. కాని కన్నబిడ్డల మోము గాంచినంతనే కడుపు నీరయినది. ఆతఁడు మరణోద్యోగము నుండి చిత్తమును మరల్చి, నదినిదాఁటి యావలకుఁ బోవలయునని తలంచెను. కాని బిడ్డల నిరువుర నొకే పర్యాయము నదిని దాటింపఁజేయుట కష్టమని యాతఁడు తెలిసికొనెను. అందువలన నొక బిడ్డని నదియొడ్డుననున్న వృక్షమునకు లతచేత బంధించి రెండవబిడ్డని నెత్తుకొని యాతఁడు నదిని దాఁటుచుండెను. శనైశ్చరుని ప్రభావము వలన నదీజల మొక్కుమ్మడిని పొంగిపోయినది; పురూరవుండెట్టులో యతికష్టముమీఁద నాబిడ్డని ఆవలి యొడ్డునకుఁజేర్చి యందున్న యొక చెట్టునకు లతచేఁగట్టి, మగిడి రెండవబిడ్డని దెచ్చుటకు నదిని దాటుచుం

డెను. అంతలో నదీజలము పెల్లువెల్లి విరిసినది ; ఆతఁడా ప్రవాహ మునఁబడి దైవపట్టణ మనఁబడు నగరమునకుఁ గొట్టుకొనిపోయెను ; ఆనగర సామీప్యమునఁగల బయళ్ళలో గొఱ్ఱెలను మేఁపుచున్న గొల్లలు, నదీజలములం దెవ్వఁడో కొట్టుకొని పోవుచున్నాఁడని చూచి తెలిసికొని, వెంటనే తెప్పలమీఁదవచ్చి, పురూరవుని బయటకుఁదీసిరి. ఆసుందర సుకుమారశరీరుఁడు స్పృహదప్పి పడియుండెను. అతనికిఁ జైతన్యము గలుగుటకుఁ దగిన యుష్ణోపచారము లొనరించి, "ఓయీ ! నీవెవ్వఁడవు ? నీరూపలక్షణాదులం బరికింపఁగా గొప్పయింటివాఁడవుగా గన్పట్టుచున్నావు ? ఈనదీప్రవాహము నందెట్లుపడితివి ? నీవృత్తాంతము నెఱిఁగింపుమ" ని గొల్లలు పురూరవునిఁ బ్రశ్నించిరి. "నేను ప్రతిష్ఠాన నగరాధీశుఁడగు పురూరవుని యాస్థానమునందలి పెంపుడు గొఱ్ఱెలను మేఁపుచుండువాఁడను ; నన్ను ఆనందకోనుఁడని యెల్లరును బిలుచుచుందురు ; అన్నలారా ! నేను మేపుచున్న గొఱ్ఱెలు ఈనదీజలములం బట్టి కొట్టుకొనిపోఁగా వానిని వెదకవలయునని వచ్చి యీయవస్థకుఁ బాల్పడితిని ; మీరు నాకుఁ బ్రాణదాన మొనరించితిరి. నేనా జన్మాంతము మీయెడఁ గృతజ్ఞుఁడనై యుందును." అని పురూరవుండు బదులు చెప్పెను ; అతని ధోరణికి గొల్ల లెల్లరును హర్షించిరి ; ఒక కంబళిని గొన్ని క్రొత్త బట్టలనుదెచ్చి కట్టుకొమ్మని యిచ్చిరి. గొల్లఁ ఱేఁడు పురూరవునిఁ దన గృహమునకుఁ దోడ్కొనిపోయి వంటకములకు వలయు పదార్థము లిచ్చెను ; నివసించుట కొక యిల్లిచ్చెను. "ఆనందకోనుఁడా ! నీవు గొఱ్ఱెపిల్లలను బెంచుచు, సుఖముగా నిందుండి కాలక్షేపము సేయుము ; నీకన్నవస్త్రములకుఁ గొదువయుండదు." అనెను ; భార్యాపుత్త్రుల నెడబాసినందులకుఁ గలిగిన దుఃఖ మగ్గలమయినను, దానిని వ్యక్తము సేయకుండఁ బురూరవుండా గొల్లఁడు చెప్పినచొప్పున మనుచుండెను.

## —♦ పురూరవుని సుతుల వృత్తాంతము. ♦—

ఓ ధర్మరాజా ! వినుము. చెట్లకు లతలచే బంధింపఁబడిన బిడ్డలను పెరుగు అమ్ముకొనుటకుఁ బొరుగూరికిఁ బోవుచున్న యొక గొల్ల స్త్రీ చూచెను ; ఆమెకు విశేషభాగ్యమున్నది ; కాని సంతానములేదు. పదియాఱు కళలతో భాసిల్లు చంద్రునిసైతము ధిక్కరింపఁజాలు ముద్దు మోములతో మురిపెము గూర్చుచున్న బిడ్డల నిద్దఱను నది కిరువైపులనుజూచి, అమితానందమొంది, " ఆహా ! ఈకసిగందుల నీనిర్జనప్రదేశమునందు విడిచిపోయిన వారెవ్వరు ? వీరిని నేనింటికిఁ గొనిపోయెదను; దాటిలో నెవరయిన నెదురుపడి, వీరు తమ బిడ్డలని చెప్పినచో వారి కిచ్చివైచెదను. " అనుకొని వారిని దన గంపలోఁ గూర్చుండఁబెట్టుకొని గృహమునకుఁ గొంపోయెను. నాఁడు మొదలుకొని యాగొల్లది బిడ్డల నిరువురను మిక్కుటమగు మక్కువతోఁ బెంచుచు, వారి కేకొఱంతయుఁ గలుగకుండ సాఁకుచుండెను ; వారును శుక్లపక్షమునందలి చంద్రుని చందమున దినదినప్రవర్ధమాను లగుచుండిరి. వారి కయిదేండ్ల ప్రాయము పైఁబడినది. " నాయనలారా ! మన యింటనున్న మేఁకపిల్లలను మీరు పెంచుచుండుఁడ " ని గొల్లపడుచు వారితోఁజెప్పి యొక కఱ్ఱను జేతికీయఁబోవఁగా, వారు దానిని ముట్టుకొనక గృహమునందున్న కత్తులను బట్టుకొని వానిని మేపుచుండిరి. ఆచిత్రమును గొల్లదిచూచి యాశ్చర్యమొందెను. " ఔరా ! వీరు సామాన్యుల బిడ్డలుగారు. దేశమును బాలించు సుక్షత్రియుల గర్భములం దుద్భవించిరనుట నిక్కము. కాకపోయినయెడల నిండాఱ నయిదేండ్లప్రాయమయిన లేకున్నను, కత్తులనే వీరు ధరింపనేల ? తగిన గురువు నాశ్రయించి, వీరికి క్షత్రియోచితములగు విద్యలు నేర్పించుట అవసరము. " అనుకొని యామె వారి కుచ్ఛిష్టమును బెట్టక, మిగుల గారాబముతో బెంచుచు, ధనుర్విద్యా పాండిత్యము విశేషముగానున్న గురువు నన్వే

షించి, విద్యాభ్యాసముకొఱకు వారి నొప్పగించెను. ఆబాలురును సమాన రూపరేఖావిలాస సంపత్తితో వెలుఁగొందుచు, మన్మథుని, సూర్యుని, అగ్నిని, అందముచేతను, తేజస్సుచేతను, కాంతిచేతను డీలు పఱచుచు నచిరకాలములోనే ధనుర్విద్యయందు నిరుపమాన వైశద్యము నలవఱచుకొనిరి ; కత్తిసాము, గుఱ్ఱపుస్వారి మున్నగువాని నందొకరి కొకరీడు దీయకుండిరి. ఆబాలుర ప్రతిభావిశేషములను గన్నులారఁ గాంచుచున్న గొల్లది, తాను గతజన్మంబున నేదియో పుణ్యకర్మ నాచరించితిననియుఁ దన్మూలముననే దేదీప్యమానముగా వెలుఁగొందు నాక్షత్రియ బాలురను బెంచుభాగ్యము దనకుఁ గలిగినదనియుఁ దలంచి సంతోషించుచుండెను

—♦ శనైశ్చరుఁడు పురూరవునియందుఁ జోరత్వమారోపించుట ♦—

అట దైవపట్టణమునందున్న గొల్లచేసికడ గొఱ్ఱెల కాపరిగా నున్న పురూరవ మహారాజు, శనైశ్చరుని ప్రభావమును మెచ్చుకొని, " స్వామీ ! నాకీ కష్టము లెప్పుడు గట్టెక్కును ? నాయాలు బిడ్డలు సజీవులయి యుండిరా ? వారిని మరల నేనీకన్నులతోఁ జూడఁగలనా ?" అని విచారించుచు నొక దినమున గొఱ్ఱెపిల్లలను దోలుకొని సమీప మందున్న సీమకుఁ బోయెను. ఒక్కచో గౌళి పలికినది. అదివిని రాజు— " అయ్యయ్యో ! గౌళి పలుకుచున్నదే ! యీ వచ్చిన యాపదలు చాలవా ! ఇఁకను రావలసిన యాపదలున్నవా ? భార్య నెడఁబాసితిని ; తుదకు గొఱ్ఱెల కాపరినై గొల్లలిచ్చు పదార్థములచేఁ బొట్టను నోముకొనుచున్నాను ; ఇన్ని సంకటములు గల్పించినందులకా దేవ దేవుని కిసుమంత యయినను జాలి కలుగక పోయెఁగదా ...... కానిమ్ము. రానున్న యాపదనుగుఱించి విచారింపనేల ? సర్వమున కాజగదీశ్వరుఁడే కలఁడు ; నేను విచారించినంత మాత్రాన రానున్న

దెప్పరము తప్పదు.” అని తలంచి, తన మనస్సు కుదుట పఱచుకొని, గొఱ్ఱెలను దోలుకొని గృహమునకు మరలెను ; అంతలో రాత్రియయి నది ; పురూరవుఁడు భోజనముచేసి నిద్రించెను. నాఁటిరాత్రి యాతని యందుఁ జోరత్వమారోపించి, గొల్ల పల్లెలో నాతనిని జోరునిగా నిరూపించి ప్రకటింపవలెనని శనైశ్చరుఁడు తలంచెను. అట్టి తలంపుతో నాతఁడు మాఱువేషముతో నానగరమును బాలించు రాజుగారి యతఃపురమునఁ బ్రవేశించెను. రాజుగారి ప్రియపత్నియొక్క శయనాగారముంజొచ్చి, యామె ధరించుకొనెడి అమూల్యాభరణములను దొంగిలించుకొని పాఱివచ్చి, ఆనంద కోనుఁడను పేరుతో వ్యవహరింపఁబడుచున్న పురూరవుని యింటికివచ్చి యాతని ప్రక్కనే యానగలమూట నుంచి యంతర్హితుఁడయ్యెను ; అంతఃపురమున దొంగదూఱెనన్న కలకల ముప్పతిల్లుటయు నప్పటికే కొందఱురాజభటులు దొంగను వెన్నాడుటయు జరిగినది. వారు పురూరవుని యింటఁజొఱఁబడిరి. వానిప్రక్కనున్న నగలమూటను జూచిరి. “ ఔరా ! వీఁడెంతటి మాయలాఁడు ! రాజాంతఃపురమునఁ బ్రవేశించి, నగలమూట నపహరించుకొనివచ్చి చెంతనుంచుకొని నేమియు నెఱుఁగనివానివలె నిద్రవోవుచున్నాఁడు.” అని యారాజభటులు నిద్రాముద్రితుఁడై యున్న పురూరవుని మేల్కొలిపి, పలువిధములగు దుర్భాషలాడి రాజ సమ్ముఖమునకుఁ దోడ్కొనిపోయిరి. ఆతనిఁదోడ్కొని యా భటులు రాజవీధినిఁబడి పోవుచున్నపుడు పౌరు లరసి పలువిధములఁ జెప్పకొనఁ దొడంగిరి. “ అయ్యయ్యో ! ఇదేమి కర్మము ! అనుప మానమగు సౌందర్యముతోను, తేజస్సుతోను ప్రకాశించుచున్న యీతఁడు చోరుఁడెట్లగును ? అని కొందఱును, “ ఏమో ! దొంగయు మానవ మాత్రుఁడేకదా ! రూపమునుబట్టి స్వభావమును, మంచి చెడ్డలను నిర్ణయింపఁగూడద” ని కొందఱును, “ ఈతనిం జూచుటతోనే స్త్రీలు మోహా వివశలగ

దుర” ని కొందఱును, “ ఈతఁడెవ్వఁడో మహాపురుషుఁడు! కాలవైపరీత్యమువలనఁ గష్టదశకు వచ్చినాఁడ” ని కొందఱును, అబ్బా ! నిర్భయముగా నంతఃపురమున్ బ్రవేశించి యాభరణముల నపహరించినాఁడా ! వీఁడెట్టి శిక్షకయినను బాత్రుఁడే ” యని కొందఱును, ఈ ప్రకారము స్త్రీ పురుషు లెల్లరు ననేక విధములఁ జెప్పికొనిరి. రాజభటులు, మంత్రి పురోహిత దండనాధ సామంత వందిమాగధ పరిజనములతో నిండుకొలువున్న రాజసమ్ముఖమునకుఁ బురూరవునిఁ దీసికొనివెళ్ళి, చేతులుమోడ్చి, “ మహాప్రభూ ! గతరాత్రి అంతఃపురమునందాభరణముల నపహరించిన చోరుఁడు వీఁడే ! వీనిని బట్టి తెచ్చితిమ” నిరి. ఆపలుకులాలకించి సభయందున్న వారెల్లరును ఆశ్చర్యమొందిరి. “ ఆహా ! ఈతఁడు చోరుఁడెట్లగును ? కిరీటధారణ చిహ్నములును, భుజకీర్తుల చిహ్నములును విస్పష్టముగా వీని మేనఁగనబడుచున్నవి. వీని రూపలక్షణాదులంబట్టి చూడఁగా, దురదృష్ట వశమునఁ బదభ్రష్టుఁడయిన సార్వభౌమునివలెఁ గనఁబడు చున్నవాఁడు. ఈ తేజస్సంపన్నుఁడు చౌర్యమునకుఁ గడంగెననుమాట విశ్వసనీయము గాదు. ” అని యెల్లరు ననుకొనిరి. గద్దియ నధిష్ఠించియున్నరాజు తన భృత్యుల నుద్దేశించి, “ సేవకులారా ! గతరాత్రి మన యంతఃపురిలో నాభరణముల నపహరించినవాఁడు వీఁడేయని చెప్పుచున్నారు ; మీ మాటలు నమ్మఁదగినవా ; చోరుని మోమునఁ గనబడులక్షణము లేవియు, వీనియందుఁ గనఁబడుటలేదు. మీఁదు మిక్కిలి మహాపురుషునివలెఁ దోఁచుచున్నాఁడు. చోరునిబట్టి యొప్పగింపకున్న మీకు దండన లభించునుగదాయన్న భయముతో నిర్దోషియగు వీనిని నిర్హేతుకముగాఁబట్టి తీసికొనివచ్చినారా ? ” అని ప్రశ్నించెను. “ మహాప్రభూ ! మా మాటలు నమ్ముఁడు. ముమ్మాటికిని వీఁడేదొంగ ! వీఁడేదొంగ ! సందేహింపఁబనిలేదు. దొంగ కాకున్నచో వీనియొద్ద

నగలమూట యెందుకుండును;" అని రాజభటులు మాఱువలికిరి. అప్పటికిని రాజునకు విశ్వాసము కుదురలేదు. అతఁడు పురూరవునిఁ జూచి, "ఓయీ! వీరు, నీవు దొంగతనముచేసితివని చెప్పుచున్నారు; అపహరింపఁబడిన నగలమూటస్సైతము నీకడనున్నది. ఇందులకు నీ వేమందువు" అనెను. అపుడు మహాజ్ఞానియగు పురూరవుండు దనలోఁ దాను— "నే నిప్పుడు దొంగతనము చేయలేదని చెప్పినను శిక్షా విముక్తిని బడయలేను. ఈయవస్థ శనైశ్చరుని సంకల్పము; దీనిం దప్పించుట కేరికిని శక్యముగాదు. కాఁబట్టి యంగీకరించి యనుభవింపఁ దగిన కష్టములకు సిద్ధపడుటయే మంచిది." అని నిశ్చయించుకొని, సవినయముగ, "రాజా! అపరాధియు నపహృదమగు నాస్తియు మీకుఁజిక్కఁగా వేఱె ప్రశ్నింపనేల? నేనే హర్తను. మీయిచ్చ వచ్చినమచ్చున నన్ను శిక్షింపుఁడ" నెను. రాజింక నేమిచేయఁగలఁడు; న్యాయాధిపతులతో, "వీనికి శాస్త్రసమ్మతమగు శిక్షను నిర్ణయిం పుడ" నెను. వారు గ్రంథావలోకన మొనరించి, "దొంగతనమున కొకకాలు నొకచేయియు ఖండించుటయే శిక్ష"యనిరి. రాజు అధికార పత్రమును మంత్రి వ్రాయఁగా దానిమీఁదఁ దన ముద్రనువైచి, రాజభటులఁ జేతికిచ్చెను. రాజభటులు దాని నందికొని వధ్యస్థలము నకుఁ బురూరవునిఁ దీసికొని పోయిరి. పురూరవుండు నిశ్చలచిత్తముతో శిక్షానుభవమున కెదురు చూచుచుండెను. వారాతని వామహస్తమును, వామపాదమును ఖండించిపోయిరి. దేహమంతయుఁ బురూరవునకు రక్తసిక్తమయినది; బాధ అధికమయినది; దాహము కలిగినది. కాని యటఁ బిలిచినఁ బలుకువారుగాని, సానుభూతిని జూపువారుగాని, సహా యము చేయువారుగాని యొక్కరును లేరు. "హా! పరమేశ్వరా! నీవు భక్తవత్సల బిరుదాంకితుఁడవయ్యు నార్తత్రాణ పరాయణుండ వయ్యు నీ భక్తుఁడనగు నన్నీరీతిని బాధింపఁదగునా! అలుబిడ్డలం గోలు

పోయి, రాజ్యముం గోలుపోయి, సకల సౌఖ్యములు గోలుపోయి, తుదకు హస్తఖండనమునకును, పాద ఖండనమునకునుగూడ గుఱియయి తినిగదా ! ఇంతటి దారుణశిక్షను నాకేల విధించితివి ? నేను నీకేమి యపకారముచేసితిని ? నీభక్తులగు సాధువులను దూషించితినా ? నీయాలయములఁ గూల్చితినా ? నీకొఱకు వ్యయము కాఁదగినసొమ్ము నన్యాక్రాంత మొనరించితినా ? భగవంతా ! ఎన్నఁడు నసత్యమాడి యెఱుంగను. పరుల కపకారము మనస్సుచేతఁగాని, వాక్కుచేతఁగాని, కాయముచేతఁగాని చేసి యెఱుంగను ; షడ్గుణములకుఁ జిక్కి యెఱుంగను ; నీతి పథమును దప్పియెఱుంగను. అట్టిచో నాకీ శిక్ష నేల విధించితివి తండ్రీ ! ” అని యా పురూరవ మహారాజు చెంతనున్న బండమీఁదఁ బరుండి భగవంతుని ధ్యానించుచుండెను. బాధోద్రేకము సైపఁజాలక యాతఁడు కొంతసేపు మూర్ఛితుఁడయ్యెను. తరువాత నల్లనల్లనవీచు పిల్లగాలులు సోఁకగాఁ దెప్పరిల్లి, విచారించిన లాభము లేదనుకొని, విధివిధానము అనుల్లంఘనీయమగుటచేత ధైర్యమవలంబించి, మనస్సులో సరస్వతీదేవిని స్మరించెను. సరస్వతీదేవి ముక్కులేని యాడుదానివలెఁ జేతనొక్క నిమ్మపండు, తెల్లని గుడ్డయు, తైలపాత్రము- వీనిని బట్టుకొని పురూరవుని చెంతకువచ్చి నిలుచుండెను. ఆతఁడామెను గుఱుతించి, “ ధన్యోస్మి ! ధన్యోస్మి ! తల్లీ ! నీవీ వేషముతో వచ్చిన మాత్రాన నీ నిజరూపమునాకు మఱుఁగువడునా ? నేను నీ భక్తుఁడను. నిన్ను హృదయమునందు ధ్యానించితిని. నీవు దయార్ద్రచిత్తవు. నాయందుఁ బ్రసన్నురాలవై నన్నుఁగాపాడ వచ్చితివి ; రమ్ము. నాబాధను నివారింపుము. ” అనెను. సరస్వతీదేవి యాతని గాయములకుఁ గట్టు గట్టి, యాఁకలిదప్పిక లడంగుటకు దివ్యామృతము నొసంగి, “ వత్సా ! నీవు తలంచినట్లునేను సరస్వతినే యగుదును. గతకాలమందొనరించిన పాపమువలన నాముక్కు కోఁతపడుట

చేత ముక్కిడినై నేను నీకుఁ గన్పట్టుచున్నాను. నీవు నాపుత్త్రుఁడవు; నావలనఁ గావలసిన యుపకారమంతయును నీవు పొందగలవు. చిత్తసంక్షోభమును విడువుము. ఇదియంతయు శనైశ్చరుని ప్రభావము. నీకు దుర్యశప్రాప్తి కలుగఁజేయుట కాతఁడీకు తంత్రమును బన్నినాఁడు. నీవు పదభ్రష్టుఁడవగుటకును, ఆలుబిడ్డల నెడఁబాయుటకును, రాజదండన మనుభవించుటకును, నీచముగ బ్రదుకుచుంటకును, ఆకలిపురుషుని మహిమయేకదా హేతువులు! కాలు సేతులు ఖండింపఁబడినందులకు సంతాపమును బొందకుము. ఏలనందువా, వినుము. సరస్వతీదేవినగు నాకుముక్కు కొఱఁతవడినది. లోకబాంధవుఁడగు సూర్యునకుఁబల్లువిరిగినవి; చంద్రునకుఁ గళలు తగ్గినవి! దక్షునకుఁ దల యెగిరినది; శుక్రునకు నేత్రము పొడువఁబడినది; ఇదే విధమున వేల్పులెందఱో పరాభవమును బొందిరి. దైవసంకల్పము వై అయినపుడు ఏమిచేయఁదగును; బ్రహ్మ వ్రాసిన వ్రాఁతను వమ్ముసేయుట కేరికి శక్యము; ఏప్రాణి యేకాలమున కే దుర్దశ ననుభవింపవలయునని యీశ్వరుఁడు సంకల్పించునో, ఆప్రాణి దాని ననుభవింపక తప్పదు." అని యాతని నోదార్చెను. పురూరవుండు సరస్వతీదేవికి భక్తిపూర్వక ప్రణామ మాచరించి, "జననీ! నీ నిర్హేతుక జాయమానకరుణా కటాక్ష వీక్షణములకే నెంతయు సంతసించితిని; నీకు నే నెల్లవేళలయందుఁ గృతజ్ఞుఁడనై యుందును. కాని చోరుఁడన్న దుష్కీర్తి పోవుటకును, ఖండితములయిన కాలుచేతులు మరల వచ్చుటకును దగిన వెరవున్నదో లేదో నాకెఱిగింపుము." అనెను. అనఁగా సరస్వతియిట్లు మాఱుపలికెను. "వత్సా! దుర్యశము పోవునాయని నీవు నన్నడుగ నక్కఱ లేదు. విజ్ఞానసంపన్నుఁడవగునీకుఁ దెలియని విషయమేమున్నది? ఖండితములయిన కాలుసేతులు మరల నీకు వచ్చును; నీయాలు బిడ్డలన నీవు కలిసికొని సుఖింతువు; నీరాజ్యమును నీవు మరలఁ బొందఁగలవు

కాని యీపనులన్నియును జరుగుట కింకను గొంతకాలము పట్టును.
అంతవఱకు నీవిట్టులే యుండవలయును. అనుదిన మేను నీకాహారపదా
ర్థాదులం గొని తెచ్చియిచ్చెదను." కృపా ప్రపూర్ణయై సరస్వతి పలి
కిన పలుకులకుఁ బూరూరవుండు కర్మము హర్షించెను ; నాఁడు మొదలు
కొని ముప్పొద్దులందు సరస్వతి వానికి వేళకు దివ్యామృతమును
త్రాగుటకును, దివ్యాన్నమును భుజించుటకును, దెచ్చియిచ్చుచుం
డెను. ఇట్లు కొన్నిదినములు గడచినవి. ఒక్కనాఁడా దైవపట్టణమునం
దున్న పరదేశి కావలియను వర్తకశిఖామణి యంతకుఁ గొన్నియేండ్లకు
బూర్వము సరకులతో విదేశములకుఁ బోయిన యోడ కనుపింపక,
ఆనాఁడే సురక్షితగతిని గనుపించుటచేత నెంతయు నానందించి, పేద
సాదలకు దానధర్మములు సేయఁదలఁచి బయలుదేరెను. ఆతఁడు పురూ
రవుఁడున్న దాఱిని బోవుచుండెను. ఆసమయమునందా వర్తకునితో
నున్నవారు, "సెట్టిగారూ! ఈస్థలమునకు సమీపమునందే యొక
చోరుని కాలుసేతులు ఖండింపఁబడినవి. ఆతఁడంతఃపురముం బ్రవేశించి,
నగలు దొంగిలించెనని రాజభటులు చెప్పుచున్నారు! కాని యాతని
ముఖవర్చస్సునుబట్టి చూచినను, శరీర శోభను దిలకించినను, కన్నుల
కాంతిని గనుఁగొన్నను, ఆతఁడు దొంగతనము చేయనివాఁడనుట
మాత్రమేకాక, ఉత్తమవంశ సంజాతుఁడగు మహాపురుషుఁడనియును
విస్పష్టము కాగలదు." అనెను. "శివాశివా! ఆతఁడెవ్వఁడో మహాను
భావుఁడై యుండును! అనవసరముగా, అన్యాయముగా రాజదండనకు
గుఱియై యుండవచ్చును; వానిని నేను చూచివచ్చెదను." అని
యాపరదేశి కావలిసెట్టి తనతోనున్న పరిజనులను బంపివైచి తానొక్క
రుఁడే పురూరవుండున్న స్థలమునకుఁ బోయెను. సూర్యునివలె నస
మాన తేజోవిరాజితుండై దివ్యమంగళ విగ్రహముతో వెలయుచున్న
పురూరవునిఁగాంచి యాసెట్టి విస్మయ మందెను ; మఱియు నాతఁ

డెవ్వఁడో మహానుభావుఁడనియుఁ దివ్య పురుషుఁడనియు నే శాపంబు కతంబుననో యట్టి యసహాయ స్థితియందుండి బాధపడుచుండెననియుఁ దలంచి, డాసి, ప్రక్కనే కూరుచుండి, తన్నుఁ జేఁగించుకొని, సంభాషణమున కుపక్రమించెను. పరదేశి సౌమ్య స్వభావము గలవాఁడగుట చేతఁ బురూరవుండాతని నైజమును గనిపెట్టి యతనితో సగౌరవముగా మాటలాడుచుండెను; అంతలో భోజనకాల మాసన్నమయినది; సరస్వతి యథాప్రకారము దివ్యామృతమునుఁ ఆహార పదార్థాదులను, ఒక గంపలోఁ బెట్టి పట్టుకొనివచ్చి పురూరవుని మ్రోలఁ బెట్టెను. ఆ జగజ్జనని జూచుసరికి సెట్టి కాశ్చర్య ముదయించినది. ఆతఁడు పురూరవునిఁ జూచి "అయ్యా! ఈచిన్నది యెవ్వరు? ఈమె నిదివఱ కెన్నఁడును నీ పట్టణమునందు నేనుచూచియుండలేదు. మఱియొక విశేషము! ఈమె సామాన్యమానవ స్త్రీ వలెఁ దోచుటలేదు; త్రిమూర్తుల భార్యలలో నొక్కతె వలెఁ గన్పట్టుచున్నది. నాయొద్ద దాపరికముంచక, యదార్థము వచించి నన్ను ననుగ్రహింపుఁడు." అనెను. పురూరవుండు సత్యము చెప్పెను. తోడనే పరదేశి సరస్వతీదేవియొక్క పాదపద్మములపై వ్రాలి, "తల్లీ! జగజ్జననీ! పాహిమాం. పాహిమాం.. రక్షింపుము—రక్షింపుము. ఈపుణ్యపురుషుని యనుగ్రహమువలన నమరదుర్లభంబయిన త్వదీయ దర్శనభాగ్యము నాకు లభించినది. నేఁటితో నాపాపములు పోయినవి." అని పలువిధముల స్తుతించెను. స్తుతించి మిన్నకొనలేదు. "అమ్మా! నీకలరూపు నెఱిఁగి ధన్యాత్ముఁడ నయితిని. కాని యీపుణ్యపురుషుఁ డెవ్వఁడు? ఈతం డెంతటి ఘనుఁడుగాకున్న వీనికి నీవాహారపదార్థములం గొనితెత్తువు? ఇట్టి పూజ్యుఁడు చోరుఁడన్న దుష్కీర్తిఁ బొల్లుడుటయేల? కాలుసేతులం గోల్పోవు టేల? ఈతని సుపవిత్ర చరిత్రమును నాకు సమగ్రముగా వినిపింపుము." అని యాతఁడా నలుమె

గంబుల వేల్పుసానిని అడిగెను. ఆమెయు మందహాసాంచిత వదనారవిం దయై, "సెట్టీ! ఈతఁడు సామాన్యమానవుఁడు కాఁడు. విధివైపరీత్యమువలన నీయగచాట్ల ననుభవించుచున్నాఁడు; కాని యీతని చరిత్ర మిప్పుడు చెప్పుటకు వీలులేనిది; ఈతఁ డెవ్వఁడో, ఈతని వృత్తాంత మెట్టిదో, గుణగణాదు లెట్టివో, స్థితిగతు లెట్టివో తెలిసికొనవలెనన్న నింక మూఁడేండ్లు గడువవలయును. అంతవరకు నితఁడీ బాధల ననుభవింపకతప్పదు. ఈతని యాఁకలి దప్పికలు తీఱుటకుఁగాను నేనీ వేషముతోఁ బ్రతిదినము దివ్యాన్నమును, దివ్యామృతమును, ఆహారపదార్థములను గొనితెచ్చిపెట్టుచుందును" అనెను. "అమ్మా! ఈపూజ్యున కిడుచున్న యాహారపదార్థములలోఁ గొంచెము నాకుఁ బెట్టుమా" యని పరదేశి సరస్వతి నడిగెను. దయార్ద్రచిత్తయగు నామె లేదనక వాని యభిమత మీడేర్చి, పురూరవునికడ సెలవుఁ గైకొని యదృశ్యురాలయ్యెను. తరువాత పరదేశి ముప్పొద్దులందుఁ బురూరవుని విడువక అతనియొద్దనే కూరుచుండి యిష్టాగోష్ఠి నెఱపుచుండెను. అంత నొక్క దినమున నుపమహర్షి యాతావునకు విచ్చేసెను; ఆతఁడు పురూరవుని వృత్తాంతమును దివ్యదృష్టివలనఁ దెలిసికొనెను. పురూరవుని ప్రార్థన నంగీకరించి యందున శిలావేదికయం దాసీనుఁడై, "రాజా! ఆపదలందు ధైర్యమవలంబింపవలయును. నీకష్టములు నాకవగతములయినవి. ఇదియంతయును శనైశ్చరుని ప్రభావము; నీవు చిత్తశాంతిని గుదుర్చుకొనుము. కష్టము లెన్నటికిని గాపురముండవు; వెన్నెలకుఁబిమ్మట చీఁకటియును, చీఁకటికిఁ బిమ్మట వెన్నెలయును వచ్చుచుండుట మన మెఱింగిన విషయమేకదా! కాలము వక్రగతిం జెందినచో నోడలు బండ్లగును; అది సక్రమగతిం బొందెనా, బండ్లోడలగును; కాఁబట్టి కష్టమొదవఁగా సంతోషించుటయు, దుఃఖము సంప్రాప్తింపఁగా విచారించుటయుఁ బ్రాజ్ఞుని లక్షణములుగావు. ప్రాజ్ఞుఁడవగు నీకుఁ జెప్ప

వలసిన దేమున్నది ?" అనెను. అంతలో సరస్వతీదేవి దివ్యాన్నమును దివ్యామృతమును, ఆహారపదార్థాదులను దెచ్చి పురూరవుని ముందుం బెట్టెను. ఉపమహర్షి యామె నవలోకించినంతనే భక్తితో సాష్టాంగ నమస్కార మాచరించెను. "తల్లీ! నేఁడు నేను ధన్యుఁడ నయితిని; సురబృందములకయిన సులభముగాఁ గానరాని త్వదీయ దివ్యసందర్శన భాగ్యము నాకొదవినది. నాయదృష్టము నేమని పొగడవచ్చును ?" అనెను. పిమ్మట సరస్వతి నిండుమనముతో నామహర్షి నాశీర్వదించి, తనపని ముగిసినంతనే దేవలోకమునకుఁ బోయెను. ఉపమహర్షియుఁ బురూరవునికడ సెలవుఁగైకొని నిజేచ్ఛంబోవుచుఁ బోవుచు, గొల్లపడు చున్న గ్రామమునకు విచ్చేసెను. అందొక విశాలప్రదేశమునఁ బురూరవుని కుమారు లిరువురును దమకుఁగల శరప్రయోగనైపుణ్యమును బ్రకటించుచుండిరి. ఉపమహర్షి తన దివ్యదృష్టివలన వారి వృత్తాంత మంతయు నాలకించి వారితోఁగూడ వారు పెరుగుచున్న గొల్లదాని యింటికి వెళ్ళెను. గొల్లది యామునీంద్రునకు నమస్కరించి యుచితము లయిన పూజావిధానములచేఁ బరితుష్టహృదయుం గావించెను. ఆతఁ డామెతో, "అమ్మా! ఈబాలుర ముఖవర్చస్సునుబట్టి చూచినను వీరు సుక్షత్రియ వంశ సంజాతులవలెఁ దోఁచుచున్నారు; కాఁబట్టి వీరికి క్షత్రియోచితములగు సమస్త విద్యలను నేర్పింపవలయును; మఱియు నుపనయనాది కర్మములు చేయింపవలయును." అనెను. అనినంతనే గొల్లపడుచు తన బొక్కసమునందలి రొక్కము కొంతగొని వచ్చి, మహర్షి హస్తములందుంచి, "దేవా! ఈకుమారుల విద్యా బుద్ధులను గఱపి, విధ్యుక్తక్రియలుసల్పి, విజ్ఞానవంతులుగాఁజేయు భారము మీయది అనెను. ఉపమహర్షి యాద్రవ్యమును గైకొని దానితో నాబాలకుల కుపనయనాదులు గావించెను; మఱియు నఱు వది నాలుగు విద్యలయందును వారిని బ్రవీణులుగాఁ జేసెను; సకల

ధర్మశాస్త్రములను సమగ్రముగా బోధించెను; వారొక్క దినమున నాచార్యోత్తముఁడగు నుపమహర్షికి మ్రొక్కి, "దేవా! మీరువమాకు మనుధర్మ శాస్త్రమును గరతలామలక మొనరించితిరికదా! భరతవర్షమును బాలించిన చక్రవర్తులలో నీశాస్త్రము ననుసరించిన మహానీయులెవ్వరయినఁగలరా?" యని యడిగిరి. అందుల కుపమహర్షి, "వత్సలారా! హరిశ్చంద్రుఁడు, నలుఁడు, పురూరవుఁడు మున్నగు మహీపతులు మనుధర్మశాస్త్రమునం దుఁ జెప్పబడినచొప్పు తప్పకుండఁ బ్రజానురంజకముగా ధరాపాలన మొనరించిరి; వీరిలోఁ బురూరవుఁడు శనైశ్చరుని ప్రభావమువలన నిప్పుడు రాజ్యమును, ఆలుబిడ్డలను గోలుపోయి, అపనిందం బొంది, కాలుసేతులు ఖండింపఁబడినవాఁడై, తుదకా సరస్వతీదేవి యనుగ్రహమున సజీవుఁడై యున్నాఁడు." అనెను. ఆపలుకు లాలకించినంతనే యాబాలుర హృదయములందుఁ జెప్పట కలవిగాని యావేదన ముదయించినది; ఆకస్మికముగా నప్రయత్నముగా వారి కన్నుల నశ్రుపూరితము లయినవి. "మహాత్మా! శనైశ్చరుఁ డంతటి పాషాణహృదయుఁడా? ధర్మపరాయణుఁడగు పురూరవ సార్వభౌమునంతటి హీనదశ కేలగొని తెచ్చెను? జీవితాంతమువరకు నాతఁడా మహారాజు నట్టి నీచస్థితియందే యుంచునా? లేక సంరక్షించునా? భవిష్యత్కాలజ్ఞులగు మీరు మాకీ విషయములను సవిస్తరముగా నెఱిగింపుఁడు." అనిరి. "వత్సలారా! శనైశ్చరుని ప్రాబల్యమింక మూఁడేండ్లును; పురూరవుండీ మూఁడేండ్ల కాలము నత్యంతదైన్యమునఁ గుందును. పిమ్మట రాజ్యమును, ఆలుబిడ్డలను, ఖండితావయవములను బొంది హాయిగా సుఖంబుండి యనేక దివ్యాబ్దములు మహీపాలన మొనరించును." అని యుపమహర్షి పలికి తాను దీర్ఘయాత్రలు సేయఁబోవుచున్నానని యాబాలుర కెఱిఁగించి యాప్రదేశమునుండి బయలుదేరెను. ఓధర్మరాజా! వినుము. పిమ్మట

నాతఁడు నదులు, నదములు, పర్వతములు, మహారణ్యములు మున్నగు వానినెల్ల సందర్శించి, తుదకు జయప్రదాదేవిని మంచనముతోఁగూడ విడిచిన సముద్రతీరమునకుఁ జేరుకొనెను. ఆతీరముననే నవకోటి నారాయణశ్రేష్ఠియు నొక భవనమును నిర్మించుకొని యందు నివసించుచుండెను. ఆతఁడా యుపమహర్షిని సముద్రతీరమునందు సందర్శించి యాతని పాదపద్మములకు మ్రొక్కి, "యోగీంద్రా! మీరేయే దేశములను సందర్శించిరి? ఏయే నగరములు చూచితిరి? మీరు కనుగొన్న నగరములలోనెల్ల నెన్నికగన్న నగరమెయ్యది? మీరెఱింగిన రాజులలో ధర్మపరాయణుం డెవ్వఁడు? మీరు సర్వజ్ఞులరు; మీకెఱుకపడని విషయమేదియునుండదు. కాఁబట్టి యనుగ్రహించి, నాప్రశ్నలకు సమాధానమిండు." అని వేఁడికొనెను. అంత నుపమహర్షి యిట్లు చెప్పెను. "ఓనవకోటి నారాయణసెట్టీ! వినుము మేము చూచిన దేశముల సంఖ్యయు, మే మెఱింగిన రాజులసంఖ్యయు సహస్రాధికముగ నుండును. మేము కనుఁగొన్న నగరములలోనెల్ల మనోహరమయినది ప్రతిష్ఠాన నగరము. అద్దానికిఁ బురూరవ సార్వభౌముఁడధినేత. ఆపూజ్యుఁడు ధర్మపరాయణుఁడు; నిత్యసత్యవ్రతుఁడు. అయిననేమి? ఈనాఁడు శనైశ్చరుని మాయవలన రాజ్యమునుగోలుపోయినాఁడు; ఆలుబిడ్డలతోఁ బరదేశముల పాలయినాఁడు; మాఱువేషముతోఁ గూలీలకు లేఖకుఁడైనాఁడు; ఆయుద్యోగ నిర్వహణమునందే భార్యను గోలుపోయినాఁడు; చిత్తవైకల్యముతోఁ దన సుతుల నిరుపుర నెత్తికొని వేఱుతావునకుఁ బోవుచుండగా మార్గమధ్యమందొక నది వెల్లువగొన్నది. ఆనదిని దాఁటఁబోయి యాతఁడు కొట్టుకొని పోయి, దైవపట్టణమునందలి గొల్లలకు దొరకినాఁడు. వారాతని కాశ్రయమిచ్చి గొఱ్ఱెల కాపరిగా నియమించిరి; అంతలో మరల శనైశ్చరుని మాయవలననే యాతఁడు రాజదండనకు గుఱియై కాలుసేతులు

ఖండింపఁబడి, సరస్వతీదేవి కృపకుఁ బాత్రుఁడగుటచే జీవములతో నిలువఁబడియున్నాఁడు. బాలురు ఒక గొల్లదాని యింటఁ బెరుగుచున్నారు. పురూరవుండు భార్యాపుత్రులతోఁ గలిసి, పోయినసామ్రాజ్యమునుబొంది సుఖించుట కింకను గడువున్నది. అంతదనుక నాతఁడీ రీతిని గష్టము లనుభవింపక తప్పదు.” ఈపలుకులను మందసమునందున్న జయప్రదాదేవి యాలకించెను. “హా! పరమేశ్వరా! ప్రాణనాథుని కాలు సేతులు ఖండింపబడినవన్న వార్త చెవులఁ బడినను, నామొండిగుండె బ్రద్దలుగాకున్న దేల? అయ్యయ్యో! ఆమహాత్మున కిట్టి కష్టములా? నీవు భక్తవత్సలుఁడవుగదా! భక్తుడనుభవించుచున్న బాధలు కన్నులారఁ దిలకించుచు మిన్నకుండు టుచితమా?” అని యామె భగవంతునిదూఱి పిమ్మట భర్త నుద్దేశించి, “కటకటా! కాంతుఁడా! కూలికొఱకువచ్చి వలలోఁబడిన నాకొఱకీ వెంతగా విలపించితివోకదా! నదీప్రవాహమునంబడి కొట్టుకొనిపోవునపుడు సహాయార్థ మేమని కేకలిడితివోకదా! కాలుసేతులు ఖండింపఁబడినప్పు డెంతబాధ ననుభవించితివోకదా!” యనుకొని బిడ్డలను, ప్రాణప్రియుని ఎడఁబాసి లోకమునుండి వేఱుపడి యామందసమునందు బంధింపఁబడి యున్నందులకుఁ దన యవస్థకుఁ దానే తద్దయు విచారించి, ముందెన్నటికయిన భర్తృ సందర్శనభాగ్యము లభించునన్న నుడిం దలపోసి దుఃఖమును దిగమ్రింగి మనస్థయిర్యమును గుదుర్చుకొనియుండెను. ఉపమహర్షియు నవకోటి నారాయణశ్రేష్ఠియొద్ద వీడ్కోలు వడసి నిజేచ్ఛంజనెను.

## పుష్పాంజలి వృత్తాంతము.

పరదేశి కావలిసెట్టి సరస్వతీ సందర్శనప్రాప్తి నడసినప్పటినుండియుఁ బురూరవుని యడుగులకు మడుగులొత్తుచు నాతనిని దన బఁ

గారు మేడకుఁ గొనిపోయి యందు రమణీయోద్యాన వనమధ్యము నందున్న యొక భవనమును నివసించుట కిచ్చెను; పురూరవుఁడా భవనమున నివసించుచు, సరస్వతీదేవి తెచ్చిపెట్టుచున్న దివ్యాన్నమును భక్షించుచు, మంచిదినములకొఱ కెదురుసూచుచుండెను; అతఁడు చిత్తశాంతి కలుగుటకొఱకు సాయంసమయములందు వీణను జేతఁబూని వాయించుచుండెడివాఁడు. ఇట్లుండఁగా నాపట్టణమును బాలించు రాజుగారికిఁ బుష్పాంజలి యను నొక కొమరితగలదు. ఆమె సౌందర్యము నందద్వితీయ; రాలు కరుగునట్లును, మొరడులు చిగుర్చునట్లును, జంతువులు మేఁతలుమాని చెవులు రిక్కవొడుచుకొని తన్మయత్వము చెందునట్లును సంగీతము పాటగల నేర్పు ఆకన్యారత్నమునకుఁ గలదు. ఆమె తనతో సమానముగఁ బాడఁగల పురుషపుంగవునిఁ బ్రేమించి పరిణయం బాడుదునని ప్రతిజ్ఞ చేసెను. ఒకనాఁటి సాయంసమయమునఁ బురూరవుండు రమణీయోద్యాన వనమధ్యమునందున్న యొక శిలావేదికపైఁ గూరుచుండి వీణవాయించుకొనుచుండెను. అతి శ్రావ్యము, మనోజ్ఞమునగు ఆవీణాగానము, సౌధోపరిభాగమునందున్న పుష్పాంజలియొక్క కర్ణములందుఁ బ్రవేశించినది. దాని నాలకించినంతనే యామె శిలాప్రతిమవలెఁ జైతన్యముడిగినట్లు నిలుచున్నది. కొంతసేపయిన పిమ్మట నామె తన చెలికత్తెలను బిలిచి, "చెలులారా! ఇదివఱ కెన్నఁడును గనివిని యెఱుంగని మనోహరగాన మీనాఁడు పరదేశి కావలిసెట్టిగారి హృద్యానవనమధ్యమునుండి యేతెంచినది. ఇంత హాయిగాఁ బాడఁగల మహాపురుషు లింతకుమున్ని దేశమునం దెవ్వరునులేరు; వారెవ్వరో నూతనముగా వచ్చినట్లు తోఁచుచున్నది. మీరేఁగి వారి వృత్తాంతము నామూలాగ్రముగాఁ దెలిసికొనిరండు." అనెను. అపుడా చెలికత్తెలు పరదేశి కావలిసెట్టిగారింటికి వెళ్ళిరి. ఆతనిం బిలిచి, "అయ్యా! మీహృద్యోద్యాన వనమధ్యమునందుఁ

గూర్చుండి, శ్రావ్యముగను, అసమాన నైపుణ్యముతోను బాడిన మహాశయుఁ డెవ్వఁడు? ఆతని వృత్తాంత మరసి రమ్మని రాకుమార్తె సెలవయినద" నిరి. "అంత మనోజ్ఞముగా సంగీతము పాడిన యువకుఁడే మధ్య రాజాంతఃపురము నందాభరణములు దొంగిలించిన నేరమునకు శిక్షింపబడి, కాలు సేతులు ఖండింపఁబడిన వాఁడ" ని యావర్తకుఁడు బదులు సెప్పెను. వారు రాజకన్యయగు పుష్పాంజలియొద్దకు వెళ్ళి, "అమ్మా! సంగీతము పాడినవాఁడు మన యంతిపురిలో నగలు దొంగిలించినవాఁడు; రాజుగారిచేత శిక్షింపఁబడి కాలు సేతులు ఖండింపఁబడిన కుంటివాఁడు." అని పలుకఁగా నామె యాలోచించి, వారిని బంపివైచి, తానేకతంబున నొక్కచోఁ గూరుచుండి, "హా! పరమేశ్వరా! గంధర్వగానమును మించిన గానముతో వెలయుచున్న యామహాపురుషుఁడు చోరత్వమునకు శిక్షింపఁబడెనా? ఆతఁడు తుచ్ఛమగు చౌర్యమునకుఁ గడంగునా? నమ్మఁజాల. నమ్మఁజాల. నాజనకుడకారణముగా నాతనిని శిక్షించినాఁడు. నాజనకుఁ డొసఁగినశిక్షవలననే యాతఁడు కాలు సేతులం గోలుపోయినాఁడు. మఱియు నాఁడుపౌరులు చెప్పికొన్న వచనములను జ్ఞప్తికిఁ దెచ్చుకొన్నచో నాతఁడు మన్మథాకారుఁడనియు నసమాన తేజశ్శాలియనియు నుత్తమవంశ సంజాతుఁడనియుఁ దెలియుచున్నది. నేనొనరించిన ప్రతినకాతఁడే తగినవాఁడు. ఆతఁడు గ్రుడ్డివాఁడయినఁ గావచ్చును; కుంటివాఁడయినఁ గావచ్చును; చోరుఁడయినఁ గావచ్చును. జారుఁడయినఁ గావచ్చును. నేనాతనిని దప్ప యితరుల నెన్నటికిని బరిణయంబాడఁజాలను." అని నిశ్చయించుకొన్నది. ఆ క్షణమునందే మన్మథుఁడామె హృదయమునందుఁ బ్రవేశించినాఁడు; అందువలన నామెకుఁ గామవికార ముదయించి యయ్యది నానాఁటి కగ్గలమగుచుండెను. ఆ సుందరాకారుఁ డెట్లుండునా? వాని నెన్నఁడు సందర్శింతునా?

వాని కౌగిళ్లలో నెన్నఁడు బంధింపఁబడి సుఖంబనుభవింతునా యని యామె తలంచుచు, నిద్రాహారపానీయములమీఁది యాసక్తిలేక, సుగంధద్రవ్యాదులమీఁది మమతలేక, నవ్యపుష్పరాజముల నొల్లక, చీనిచీనాంబరశ్రేణిని వర్జించి, పెంపుడుచిలుకల నుపలక్షించి, అంచల పిండుల సరకుఁగొనక, పిలిచినఁ బలుకక, పలికిన సరిగా పలుకక, మతి భ్రమణము పొందినదానివలె దినమొకయుగముగాఁ గడుపుచుండెను. సఖీజనములు పుష్పాంజలి కామునిబారికిఁ జిక్కి, దుస్సహబాధకు లోనయినదని గ్రహించి, యారహస్యమును ఆమె తల్లియుఁ బట్టపుదేవియునగు తిలకవతి కెఱిఁగించిరి. తిలకవతి తనభర్త కెఱిఁగించినది. తోడనే రాజు, పుష్పాంజలికి స్వయంవరమునేయ నభిలషించి యొక శుభముహూర్త నిర్ణయమునుగావించి, ఆహ్వానపత్రికలు వ్రాయించి, వానిని భరతఖండమునందుఁగల యేఁబదియాఱుదేశముల నేలురాజన్యులకును బంపించెను. తండ్రి తనకు స్వయంవరమహోత్సవము మూలముసఁ బెండ్లిసేయనున్నాఁడని విని బెంగఁగొన్నది. "అయ్యో! నాతండ్రిని వెనుక యొకప్పు డేఁబదియాఱుదేశముల రాజులును ముక్తకంఠములతో నన్నర్థించిరి. అపుడు వారికి నన్నిచ్చుట కాతఁడంగీకరింపలేదు. ఈనాఁడు వారినిగోరి స్వయంవరమునకు రండని యాహ్వానించుచున్నాఁడు. నాచిత్తమా గాయకశిఖామణియందు హత్తుకొన్నది. త్రికరణములచేతను నేనాతనిని ప్రాణపతిగాఁ దలంచుచున్నాను. ఆతని పొందు చిక్కనినాఁడు నే నీలోకమున నొక్కక్షణమయిన బ్రదుకఁజాలను. ఆతఁడు కుంటివాఁడు. నాస్వయంవరమున కెట్లురాఁగలఁడు? నా నుదుటివ్రాలెట్లున్నది? దైవమా! నీవు నాకుఁ దోడ్పడుము. నేను మనస్సుచేతఁ గాంక్షించిన యువకుని నాకు భర్తగాఁ జేయుము." అని దేవునకుఁ బెక్కుఁగతుల మ్రొక్కి, తదుపరి యొక జ్యోతిష్కుని రావించి తన భవితవ్యమును గుఱించి ప్రశ్నించెను.

అప్పుడాతఁ డామెతో నిట్లనెను. "ఓ కన్యారత్నమా! నీవు విచారముడుగుము; నీవు సార్వభౌముని గామించియున్నావు. అతఁడు శనైశ్చరుని మహిమవల్ల నిపుడగచాట్లను బొందుచున్నాఁడు. ఆతఁ డొకప్పుడు మంగళకరమగు గీతమును బాడినప్పుడే నీకంఠసీమయందలి హారములోని పచ్చలఱాయి నీరుగాకరగి ప్రవహించినది. నీభవన ప్రాంగణమునందున్న యొకమోడు చిగిర్చినది. ఆతఁడు నీకు భర్తయగుట తథ్యము." అని పలికి యామెవలన బహుమానంబు వడసి నిజేచ్ఛం జనెను. పుష్పాంజలి దైవజ్ఞునిమాటల నాలకించి, ధైర్యము చిక్కఁబట్టి, ఎన్నఁడా గాయకశిఖామణిని జూడఁగలుగు కాలము సమీపించునా యని తదాగమనమును నిరీక్షించుచుండెను. పరదేశి కావలిసెట్టి భవనమునందున్న పురూరవుండు పుష్పాంజలీ స్వయంవరవృత్తాంతము నాలకించి మిన్నకుండెను; యథాప్రకార మాతని కాహారపదార్థములం గొనితెచ్చిన సరస్వతీదేవి, "వత్సా! నీగానవిద్యకు పుష్పాంజలియొక్క చిత్తమాకర్షింపఁబడినది. ఆమె నిన్నుఁ బరిణయమాడఁగలదు." అని తెలిపి దేవలోకమునకుఁ బోయెను. ఆ పలుకులు రాజునకాశ్చర్యజనకములయినవి. "ఇదేమి? నేను కాలుసేతులను గోలుపోయి దుఃఖదందహ్యమానమనస్కుఁడనై కుందుచుండుటయేమి? రాకుమార్తె నన్నుఁ గామించి పరిణయంబాడుటయేమి? దైవలీలలెంతవారికేని దురవగాహములుగదా!" అనుకొనెను. అంతలోఁ బరదేశికావలిసెట్టి యక్కడకువచ్చి పురూరవునితో, "అయ్యా! నేఁడు రాజుగారి కూతురయిన పుష్పాంజలికి స్వయంవరమహోత్సవముగానున్నది. అందులకీ భరతఖండమునఁగల యేఁబదియాఱు దేశములనేలు రాజవరేణ్యులును వచ్చియున్నారు. మనముసైతము స్వయంవరమంటపమునకుఁ బోయి ప్రేక్షకులకొఱకుఁ బ్రత్యేకింపఁబడిన వేదికలయందుండి ఆ వేడుకను జూచివత్తము దయచేయుఁడు." అని యొక

బంగారుపల్లకియం దాతనిని గూర్చుండఁజేసి, స్వయంవరమంటపమునకు వెళ్లి పూర్వోక్తప్రకారమున నుండెను. స్వయంవరముహూర్త మాసన్న మగుటతోనే దాదులు పుష్పాంజలిని బన్నీట జలకమాడించిరి; నానావిధామూల్య సుగంధద్రవ్యములు మైపూఁత కుపయోగించిరి; చీని చీనాంబరమును, అమూల్య మణిప్రభాభాసితములగు నాభరణములను ధరింపఁజేసిరి. మఱియు నా నగరమెల్లయెడలఁ గైసేయఁబడి, చూపరుల హృదయముల నాకర్షించుచుండెను; స్వయంవరమంటపమత్యంతరమణీయముగ సింగారింపఁబడినది. స్వయంవరమునకు విచ్చేసిన రాజవరేణ్యు లెల్లరును దమతమ యౌన్నత్యములకుఁ దగినవిధమున వేషభూషలుదాల్చి స్వయంవరమంటపమును బ్రవేశించి యందమర్పఁబడిన యుచితాసనములం దుపవిష్టులైరి. అంతలోఁ బురోహితుల వేదోక్తవాక్కులును, వందిమాగధుల కైవారములును, మంగళవాద్యముల మ్రోఁతలును ఎసఁగెను. నిర్ణీతసుముహూర్తమునఁ జేతనొక పుష్పమాలను బట్టుకొని చెలికత్తెలతోఁగూడి పుష్పాంజలి స్వయంవరమంటపమును బ్రవేశించెను. చెలికత్తెలా మంటపమునందు సుఖాసీనులై యున్న రాజుల వృత్తాంతములను, వంశాదికములను, పేరుప్రతిష్ఠలను పుష్పాంజలికి వర్ణించిచెప్పుచుండిరి. కాని యవి యామెచెవులందు జొరఁబడుటలేదు. తన మౌక్తికహార మధ్యమునందలి పచ్చతాయి నీరుగా కరగి ప్రవహించునట్లు మనోహరముగా సంగీతముపాడి యువకుఁ డెచ్చోటనున్నాఁడా యని యామె తన దృక్కులను నలదిక్కులయందుఁ బ్రసరించెను. రాజుల నేరిని గన్నెత్తి చూచుటలేదు సరికదా చెలుల పలుకులనయినను వినుటలేదు. తన మానసచోరు మెడలోఁ దానాపుష్పదామము వేయఁజాలకున్నఁ బ్రాణములనయి విడుతునుగాని పరపురుషునిఁ బరిణయమాడనని యామె దృఢముచేకొనెను. సభాస్థలియందున్న రాజపుంగవు లామెసౌందర్యలావణ

దులంగాంచి యాశ్చర్యము నొందుచుండిరి. "ఔరా! దేవతలయందుఁగాని, యక్షకిన్నర గరుడగంధర్వాది దివ్యజాతులయందుఁ గాని, అప్సరసల యందుగాని, మర్త్యజాతి యందుగాని, ఈ యెలనాఁగను బోలిన సౌందర్యరాశి వేఱొకతెయుండదు; ఈమెను జేపట్టు ధన్యుఁడెవ్వఁడో!" యని తమలోఁ దాము గుజగుజలు వోవుచుండిరి. ఆ సమయమున దేవతలు గగనసీమనుండి పుష్పాంజలియొక్క రూపలేఖావిలాసాదులంగని విభ్రమముచెంది, వేల్పుఁబెద్దయగు బ్రహ్మదేవు నవలోకించి, "పితామహుఁడా! ఈ కన్యారత్నము స్వయంవర మంటపమునందున్న రాజశేఖరులలో నొక్కరిని వరింపకున్నది కదా! తుదకీమెను బెండ్లాడువాఁ డెవ్వఁడు?" అనిరి. అందులకు వాణీశుఁడు, "వత్సలారా! ఈమె కొలఁదినిమిషములలోనే కాలుసేతులు ఖండింపఁబడిన యొక కుంటివానిని వరింపఁబోవుచున్నది. చూచుచుండుఁడ" నెను. దివ్యులందఱును విస్మయాకుల స్వాంతములతో నావిచిత్రసంఘటనమును జూడవలెనని యుండిరి. పుష్పాంజలి తన మానసచోరుఁడు సభామంటపమునఁ గనఁబడనందుల కెంతయుఁ జింతించుచుఁ దనకుఁ బ్రియురాలయిన చెలికత్తెతో రహస్యముగా నిట్లనెను. "సఖీ! గానకళయందు నన్నుమించిన పురుషుని నేను వరింతునని బాసచేసితిని. ఆ పురుషుఁ డీనగరమునందున్నవాఁడు; వానిని మీరు కన్నులారఁ దిలకించితిరి. కాని నేను దురదృష్టవశమున నీక్షణమున నిచ్చోటఁ జూడఁజాలకున్నాను నేనీ పుష్పమాలచే నాతనికంఠము నలంకరింపలేకున్న నీక్షణముననే ప్రాణపరిత్యాగ మొనరింతును; నాప్రాణములు నిలువవలెనన్న నాపురుషుఁడు నాకంటఁ బడవలయును. అందులకుఁ దగిన వెరవెయ్యది?" అపుడు చెలికత్తె పుష్పాంజలితో మృదుమధురస్వరమున నిట్లనెను. "సఖీ! నీవు ఆత్రమును విడువుము. సృష్టికర్తయగు బ్రహ్మదేవుని సంకల్పమెట్లున్న నట్లు జరుగకమానదు. బ్రహ్మసంకల్పమునకు వ్యతిరిక్తముగా ముప్పదిమూఁడుకోట్ల దేవత

లేకమయ్యు నేమియుఁ జేయఁజాలరు. నీమానసచోరుఁడగు పురుషున కును నీకును వివాహము గావలయునని విధాతసంకల్పించినచో నది జరిగియే తీరును. దానినెవ్వరు నడ్డలేరు. ఆ పురుషుఁ డేమాఱుమూల యందు దాఁగినను, నీవీమూల నాతనికంఠసీమ వేయఁగలవు. మున్నొక విచిత్రసంఘటనము ప్రాప్తించినది. దానిని నీకు దృష్టాంతరముగాఁ జెప్పుచున్నాను ; వినుము:—

పూర్వము విశాలనగరమును విశాల భూపతియను ఱేఁడు జనాను రంజకముగాఁ బాలించు చుండెను ; ఆతనికి భాగ్య భోగ్య ములును, సర్వ సౌఖ్యములును గలిగియున్నవి. కాని, సంతానము మాత్రములేదు. సంతానార్థియై యమ్మహీపతి సమస్త దానము లొన రించియు విఫల మనోరథుఁడయ్యెను. తుదకుఁ బెద్దల యనుమతంబున నాతఁడు రాజ్యభారమును మంత్రుల భుజాస్కంధముల యందిడి, తాను మునికులోచిత వేషధారణ మొనరించి, హిమవత్పర్వతమునఁ బెక్కేండ్లు భక్తవ శంకరుండగు శంకరుని గూర్చి బహు ఘోరముగఁ దపంబాచరించెను. పరమశివుం డాతనియెడఁ బ్రసన్నుఁడై యొకపుత్రికా మణి యుదయించు వరమును దయచేసెను. రాజు తపంబు చాలించి గృహోన్ముఖుఁ డయ్యెను. తరువాతఁ గొలఁది దినములలోనే రాజపత్ని యంతర్వత్నియై చక్కని చుక్కవంటి కొమరితను బ్రసవించెను. ఆ బాలికామణి శుక్ల పక్షమునందలి చంద్ర రేఖవలె దిన దిన ప్రవర్ధ మానయై సకల శాస్త్రము లభ్యసించి లలిత కళలయందుఁ బ్రావీణ్య మును సంపాదించెను ఆమెకు వివాహోచిత ప్రాయముపైఁ బడినది. అపుడామె తల్లి తనభర్తయొద్దకుఁ బోయి, "నాథా! మన చిన్న దానిని నాతమ్మునికిచ్చి పెండ్లిచేయవలయున" న్నది. అందుల కాతఁడిష్టపడలేదు. "నీ యభిప్రాయమును నే నెన్నటికిని అంగీకరింపను. ఈమెను నా మేనల్లునకిచ్చి పెండ్లి కావింతును." అని యాతఁడనెను.

అట్లు ఆమె పెండ్లినిగూర్చి తల్లి దండ్రులిరువురును భేదాభి ప్రాయములు గలిగియుండిరి. దేవతలా విషయము నెఱిఁగి, బ్రహ్మయొద్దకరిగి, "తాతా! విశాలభూపతి పుత్రికను దల్లి తన తమ్మునికిచ్చి పెండ్లి చేసెదనని బాసచేసినది; తండ్రి తన మేనల్లునకిచ్చి పెండ్లి చేసెదనని బాసచేసినాఁడు. తుదకా యిరువురి పంతములలో నెవరి పంతము నెగ్గఁగలదు?" అని ప్రశ్నించిరి. అంత బ్రహ్మదేవుఁ డాలోచించి "వత్సలారా! ఆ కన్యను హిమవత్పర్వత మందున్న యొకకుష్ఠురోగి వివాహ మాడఁగలఁడు. అదియే నా సంకల్పము." అని మాటు వలికెను. ఆమాటలకు దేవతలు తెల్లఁబోయిరి. ఎందులకుఁ బొందని విధాత్రు సంకల్పమును నమ్మ నేయవలయునని నిశ్చయించుకొని, తరుణము కొఱకు వేచియుండిరి. విశాల భూపతి భార్య, తన పుత్రికామణిని దనకుఁ దెలియకుండఁ దనభర్త వాని మేనల్లునకిచ్చి యెక్కడ పెండ్లి చేయునోయని యొక సుందసమును దెప్పించి యందామెకు వలసిన యాహార పదార్థములను వస్త్రాదులను ఉంచి, ఆమె నందుంచి పెట్టె మూతవైచి దానిని నదీతీరమున విడిచిరమ్మని రహస్యముగా భటుల కాజ్ఞాపింపఁగా వారట్లుచేసిరి. దేవతలు బ్రహ్మ సంకల్పము తప్పింపవలెనని బద్ధకంకణులై, గరుత్మంతుని బిలిచి, "పక్షిరాజా! హిమవత్పర్వతము నందొక కుష్ఠురోగి యున్నవాఁడు. వానిని గొనిపోయి నరుల కంటఁబడని పర్వత గహ్వారంబున విడిచి తాతిపలకను మూతవేసిరమ్ము." అని వేడిరి. దివ్యుల కోరిక ననుసరించి గరుడుఁడు బయలుదేరి హిమాచలమున కరిగి యందొకచో వ్యాధి గ్రస్తుఁడై యున్న యా పురుషుని పర్వతగృహములోనికిఁ దోడ్కొనిపోయి విడిచెను. ఆ కుష్ఠురోగి కన్నీరు మున్నీరుగాఁ గార్చుచు, దీనాననుఁడై, "ఓ విహంగ వల్లభా! జగద్రక్షకుఁడును, ఆర్తత్రాణ పరాయణుఁడును నగు శ్రీ మహావిష్ణుమూర్తికి వాహనమవుగదా! శరణాగతులను సాకు నైజము నీవు

విడువఁదగునా ? నేను నిన్ను శరణంటిని. ఆఁకలి దప్పులబాధ యడంగుటకుఁ దీఅని యీ ప్రదేశమునందు నన్ను విడిచి పోవుట నీకు భావ్యమా ?" యని వేఁడుకొనఁగా, "నీవు విచారింపకుము. భయపడకుము. నీ కాహార పదార్థములంగొని తెచ్చి యిత్తును. మరలఁ ద్వరలోనే నీకు స్వేచ్ఛ నొసంగుదును." అని గరుత్మంతుఁడు పలికి మింటి కెగసి వచ్చుచుండఁగా, నదీతీరమునందు రాకొమరితయున్న మందసము వానికిఁ గనఁబడినది. అందున్న భక్ష్యములు పరిమళించినవి. ఆ పరిమళమును గ్రహించి యది యాహార పదార్థముల మందసమని తలంచి గరుడుఁడు దానిని దన్నుకొనిపోయి కుష్ఠురోగిని దాచిన కొండ గృహాలోఁబడవైచి మరల దాని తలుపుమూసి స్వస్థానమున కరిగెను. ఆ పెట్టెయందేమున్నదోయని కుష్ఠురోగి దానిని దెఱచి చూచెను; చూచుటతోనే వానికండ్లు చెదరిపోయినవి; సౌదామినివలెఁ దళతళ మెఱయుచుఁ బదియాఱు వన్నె పసిండికయిన వెలగట్ట నీయని మేని చాయతోను, విశాలనయన యుగ్మముతోను అచ్చరలేమలఁ గేలినేయు సౌందర్యాతిశయముతోఁ జెలఁగుచున్న రాజకన్య యాతని కంటఁ బడినది. ఆమె మందసమునుండి లేచి, చేతనున్న పుష్పమాల నాతని మెడయందుంచి, "మహాశయా! ఈపెట్టె నెవ్వరు తెఱచెదరో వారి కంఠమందు మాలనుంచి, వరింపుమని నా జనని నా కాజ్ఞాపించినది. ఈ పెట్టెను మీరు తెఱచి నాకుఁ బ్రాణేశులయిరి. నేటినుండియు నేను మీకు సహధర్మ చారిణి నయితిని." అనెను. అతఁడు తన యదృష్టమును వేనోళ్ళఁ బొగడుకొనుచు నామెతోఁ గామోపభోగములందేలి యాడుచుండెను. అట విశాలనగరమున రాజు తనకొమరిత వివాహము నకు శుభముహూర్తనిర్ణయము గావించెను; కాని పెండ్లికొమరితమాత్ర మంతఃపురమునఁ గాన్పింపలేదు. దేవతలు గరుత్మంతునివలనఁ గుష్ఠురో

హిమవత్పర్వత గహ్వరమునందు గుప్తపఱుపఁ బడెనని తెలిసికొని, బ్రహ్మదేవుఁడు చెప్పిన ముహూర్తము గడచిపోవుటచేత నాకుష్ఠరోగి కిని రాజపుత్రికకును సమావేశము జరుగలేదని తలంచి తాము బ్రహ్మ నిర్ణయమును వమ్ముసేయఁ గలిగితిమని యధికోత్సాహము జెందుచు నా పరమేష్ఠికడకుఁబోయి, “ తాతా ! నీమాట తప్పిపోయి నదికదా ! ” అనిరి. బ్రహ్మదేవుఁడు మందహాసాంచిత వదనారవిం దుఁడై, దేవతల నవలోకించి, “ వత్సలారా ! మీరు పొరబడు చున్నారు. నామాట ఎప్పటికిని బూటకము కాఁజాలదు. మీరు హిమవత్పర్వత గహ్వరమును జూడుఁడు. అందా కుష్ఠరోగి రాకుమా ర్తెను బెండ్లియాడి యామెతో సుఖంబనుభవించు చున్నాఁడ ” నెను. వారా పలుకులు నమ్మఁజాలక, వెంటనే యాప్రదేశమునకుఁ బోయి చూడఁగా వారికి దిగ్భ్రమ కలిగినది. బ్రహ్మ చెప్పిన చొప్పున నాదం పతులు వారికంటఁ బడిరి. వారు తెల్లఁబోయి గరుడుని యొద్దకేఁగి, “ పక్షిరాజా ! ఆ గుహయందు వ్యాధిగ్రస్తు నొక్కనినేగదా నీవుంచి తివి ! రాకుమార్తె యెట్లు వచ్చినది ? అయ్యిరువురకు సమావేశమెట్లు జరిగినది ? ” అని ప్రశ్నించిరి. తనకేమియుఁ దెలియదనియు నదీతీర మందుఁ దనకంటఁబడిన యాహారపేటికను మాత్రము తా నాతని కొఱకందుఁ బడవేసితినని గరుడుఁడు బదులు చెప్పెను. దేవతలు తరు వాతి కథను రాకుమార్తెవలన విని యామె భర్తకు రోగ విముక్తిని గలిగించుటయేకాక, అనేక వరములిచ్చి, బ్రహ్మ వాక్కును దప్పిం చుట కేరికిని శక్యము గాదనుకొనిరి— వింటివా ! సఖీ ! కాఁబట్టి నీకాగాయక శిఖామణిని గూర్చవలయునని బ్రహ్మ సంకల్పించిన నాఁడు దానిని గాదనుటకును, దప్పించుటకును యేరికి శక్యము ? నీవు చిత్త వైకల్యమును బోనాఁడుము ; మనశ్శాంతిని గుదుర్చుకొనుము. ” పుష్పాంజలి చెలికత్తె పలికిన పలుకులు ధర్మ బద్ధములును, యదార్థ

ప్రతి పాదకములును అగుటచేత సంతోషించి, క్షణకాలము కనులు మూసి, నిశ్చలధ్యాన మవలంబించి భగవంతునిఁ దలంచుకొని, " నేను మహా సద్గుణసంపన్న నయ్యెదనేని ఈపూలదండ నా మానసాపహరణ మొనరించిన యోగాయక శిఖామణి కంఠమునఁ బడుఁగాక ! అని దానిని మింటి కెగురవేసెను. సభాస్థలి యందున్న రాజులెల్లరును గనుఁగొని యాశ్చర్యమునొంద నయ్యెది, ప్రేక్షకులకొఱకుఁ ప్రత్యేకింపఁబడిన వేదికయందు పరదేశికావలిసెట్టి ప్రక్కనే యుపవిష్టుఁడై యున్న పురూరవుని కంఠమునఁబడెను. అది చూచి సభికులు తమలోఁ దాము గుజ గుజలు వోయిరి. క్షణములో స్వయంవర మంటపమునఁ గోలాహాల ముదయించెను. " అయ్యయ్యో ! ఇదేమి ? ఈ కన్యయొక్క తలవ్రాలెట్లున్నది ? ఆభరణాపహరణమునకు శిక్షింపఁబడిన కుంటివాని నెట్లు వరించినది ? " అనువారును, " ఈమె మూలమునఁ దలిదండ్రులకును, వంశమునకును దీజని యపకీర్తి వాటిల్లినది. " అనువారును, " ఆకసంబున కెగరవేసిన పుష్పదామ మీతని కంఠమునందే యేలపడవలయును ? సభా మండపమునందుఁ దక్కంగల రాజవరేణ్యులెందరు లేరు. ఇది యంతయుఁ జూడఁగా నీతఁడెవ్వఁడో దివ్య పురుషునివలెఁ గన్పట్టుచున్నాఁడు. " అనువారునై సభికులు మంతనములు సేసిరి. రాజ దంపతులు తమ పుత్త్రిక చోరునిఁ బెండ్లియాడెనని విని మూర్ఛ మునింగిరి. అంత విశాలభూపతి మంత్రిని బిలిచి, " అమాత్య శేఖరా ! నాకీ ప్రాణములపై నాశలేదు ; పరాభవము కలిగించిన పిమ్మట ప్రాణ త్యాగమే శరణ్యము. నేను మరణింతును ; నీవు భద్రముగా రాజ్యపాలనము సేయుచుండుమ " ని దుఃఖించుచుండఁగా కులగురుఁడగు వసిష్ఠుఁడచ్చటికివచ్చి, " రాజా ! విధి విధానము నతిక్రమించుట కేరికగును ? ఆకుంటివానికిని నీ కొమరితకును ఘటన మున్నది. అందువలన నా యుభయులును దంపతులయిరి. కాబట్టి నీవు దుష్కీర్తి

భయపడి మరణింపఁజనదు. ఆమె నింట నుండనీయక, అడవులకుఁ బంపి వేయుమ" నెను. రాజు భార్యయు నందులకు సమ్మతించెను. పుష్పాంజలి తల్లి దండ్రులకును, బ్రహ్మర్షి చంద్రుడగు వశిష్ఠునకును బ్రణమిల్లి, "మీరు నన్నడవులపాలు సేయుటకు ఖేదపడనక్కఱలేదు. సతికిఁ బతియే యేడుగడ; పతిని విడిచిన సతి బ్రదుకొక బ్రదుకుగాదు. నేను నాభర్తతోఁ గలిసి, పోవుచున్నాను. వారెచ్చటనున్న నేనచ్చటనే నివసింతును. వారు మహారణ్యమధ్యమునందున్న నేనును నచ్చటనే నివసింతును. ఆమహారణ్యమే వారితోనున్నపుడు నాకు భర్మ్యహార్మ్యము కాఁగలదు; కనుక నాకు సెలవొసంగుఁడు." అనెను. కానక కానక కన్న సంతానమగుటచేత నామె యందుఁ దల్లిదండ్రుల కత్యంతవాత్సల్యముగలదు. వారామెను విడిచియుండుట కెంతమాత్ర మంగీకరింపఁజాలక, తొంటిధైర్యమును విడనాడి, "అమ్మా! సాటివారిలోఁ దలవంపులయిన నగుఁగాక! నిన్నువిడిచి మేముండఁజాలము. నీవిందేయుండుమ" నిరి. అందులకుఁ బుష్పాంజలి యంగీకరింపలేదు. విశాలభూపతి మనస్సునందమితముగా విచారించి, "కుమారీ! నీవు చిన్నతనమునుండియు మిక్కిలి గోముగాఁ బెరిగినదానవు—కష్టమన్న నెట్టిదో యెఱుంగవు. అరణ్యవాస మతిశోచనీయము; నీభర్త కాలుసేతులు లేనివాఁడు; కూర్చుండి లేవలేఁడు; లేచినఁ గూర్చుండలేఁడు; దాసదాసీజనములచేత వలసిన సౌకర్యములు గల్పించుట కాతనికడ నొకరాగిదమ్మిడీయయిన లేదు. కాఁబట్టి నీవు సందేహింపక వలసినధనమును, భృత్యులను, చీనిచీనాంబరశ్రేణిని, ఆభరణములను వెంటఁ గొని పొమ్ము." అని బ్రతిమాలెను. పుష్పాంజలి యందులకుఁ గూడ నొడంబడలేదు సరికదా, మేనిసొమ్ములు గూడ నొలిచి యటనునిచి సామాన్య స్త్రీవలెనుండి, తల్లితండ్రులకడ సెలవుగైకొని పురూరవుని జేరి, అతని పాదపద్మములకుఁ బ్రణమిల్లి భయభక్తు లభినయించుచు

నిలుచుండెను. అతఁడు మందహాస మొనరించి, "ఓ మహారాజపుత్రీ! చోరత్వమునకుఁ గాలుసేతులు ఖండింపఁబడి దిక్కుమాలిన జీవనము గడపుచున్న నిఱుపేదనగు నన్నుఁగామించితివేల ? నీయాభిజాత్య రూపలావణ్యతారుణ్య వైభవాదులకుఁదగినవానిని వేఱొక్కనివరించి సుఖింపుము ; ఇప్పుడు మించినదిలేదు." అనెను. పుష్పాంజలి హస్తములు మోడ్చి, "ప్రభూ ! నేను మీచరణ దాసిని. నాకు భాగ్య భోగ్యము లక్కరలేదు—సౌఖ్యములతోఁ బనిలేదు—త్రికరణశుద్ధిగా మిమ్ములను నేను ప్రేమించితిని ; మీరే నాసర్వస్వమనియెద. నమ్మికొనియుంటిని. కాఁబట్టి మీపాదసేవ నొసఁగి నన్నను గ్రహింపుఁడు— లేకున్న మీ పాదసన్నిధియం దీక్షణముననే ప్రాణములు విడుతును." అనెను. ఆమె సాధ్వీత్వమునకుఁ బురూరవుఁడెంతయు సంతసించెను. "చిన్నదానా ! నీయిచ్ఛవచ్చిన మచ్చున మెలంగవచ్చును. నేను నిన్నుఁ దిరస్కరించుటలేదు ; మనము కొన్నిదినములవఱకీ పరదేశికావలి సెట్టిగారి భవనమునం దుండవచ్చును" అనెను "నాథా ! మనమొక్క క్షణమయిన నీనగరమున నుండఁగూడదు. మహారణ్య మధ్యమునకుఁ బోవలయును. అట నెన్నికష్టములయిన లభించుఁగాక !" అని పుష్పాంజలి మాటువలుకఁగా పురూరవుం డామె యభిప్రాయమును ద్రోసి రాజనలేకపోయెను. పురూరవుని విడువవలసి వచ్చినందులకుఁ బరదేశికావలిసెట్టి యెంతయు విచారించెను. కాని యాదంపతులకు మాటు చెప్పలేక యొకబంగారు పల్లకి దెప్పించి యందు వారిని గూర్చుండఁజేసి, నగరమునకావలఁ గొన్ని మైళ్ళు దూరమున విడిచివచ్చెను. పురూరవుఁడు పుష్పాంజలితో నచ్చటనుండఁగా, సరస్వతీదేవి దివ్యామృతమును, దివ్యాన్నమును, దక్కంగల యాహారపదార్థములను గొనితెచ్చి దంపతుల మ్రోలఁ బెట్టెను. పుష్పాంజలి యామెను సరస్వతీదేవిగా గ్రహించి, చేతుల

మోడ్చి నమస్కరించి భక్తితో బహువిధముల సంస్తుతించెను. తరువాత దంపతు లిరువురును దృష్టిదీక్ష దివ్యపదార్థములను భుజించిరి. సరస్వతీదేవి ఆమెను హృదయపూర్వకముగా నాశీర్వదించి, "కుమారీ! నీవీ నిర్జనప్రదేశమున నంధకారబంధురమగు రాత్రి సమయమున నెట్లుండఁగలవు? నీకు నివసించుటకు మందిరము కావలయునుగదా!" యని సంకల్పమాత్రముచేత నక్కడ నానావిధరత్నప్రభాభాసితమగు బంగారుమేడను నిర్మించెను. అది చూచి పుష్పాంజలి తనభర్త సామాన్యుఁడు కాఁడనియు నెవ్వఁడో దివ్యపురుషుఁడనియుఁ గాకున్న సరస్వతి దాసురాలై యుపచర్యలు చేయఁజాలదనియు గ్రహించి, తనభాగ్యమునకుఁ దన్నుఁదాను మెచ్చుకొనెను. ఆ సుందరమందిరమునందా దంపతులను సుఖంబుండుఁ డనిచెప్పి సరస్వతి దేవలోకమునకుఁ బోయెను.

ఆ సమయమున దేవతలలో నొక వివాదము తటస్థించినది. "విధివిధానము గొప్పదా? లేక బుద్ధి గొప్పదా?" అన్న ప్రశ్నకుఁ దగిన సమాధానము కావలసి దేవతలు తమలోఁదాము గ్రుద్దులాడుకొని, తుదకు సరస్వతీదేవి యనుమతంబునఁ బురూరవు నడిగి తెలిసికొనవలెనని సంకల్పించుకొనిరి. ఆ సంకల్పముతో నిరువురు దివ్యులు వృద్ధబ్రాహ్మణవేషధారులై పుష్పాంజలీ పురూరవులున్న బంగారు మేడ యొద్దకు విచ్చేసిరి. వారు పురూరవుని సందర్శించి, సవినయముగా, "మహాశయా! మేముత్తర దేశస్థులము. చిరకాలమునుండి మాలో మాకొక వివాదము వెలువడినది. అయ్యది నీవలనఁ బరిష్కరింపఁబడవలసి యున్నది. అందుకొఱకు నీయొద్దకు వచ్చినాము. విధివిధానము గొప్పదా? మనస్సు గొప్పదా? మాకు సహేతుకముగాఁ జెప్పవలయున"నిరి. పురూరవుండు మందహాసమొనరించి బాగుగా నాలోచించి, "అయ్యలారా! విధివిధానమునకు మించినది లేదు. మనస్సు

విధినిర్దిష్టమునకు పాటికాఁజాలదు. విధివిధానము ననుసరించియే సూర్య పుత్త్రుఁడగు శనైశ్చరుఁడు కాకినెక్కి తిరుగుచుండును; దరిద్రదేవత గాడిదనెక్కి తిరుగుచుండును; ఇంద్రుఁడు సహస్రయోనులు గలవాఁ డయ్యెను; మన్మథుఁ డంగహీనుఁడయ్యెను; మాండవ్యుఁడు కొఱఁత వేయఁబడెను. పురూరవసార్వభౌముఁడు కాలుసేతులు ఖండింపఁబడిన వాఁడాయెను." అని సమాధాన మీయఁగా, వారిలో నొకఁడుఁ "ఆర్యా! మార్కండేయమహర్షి ద్వాదశాబ్దవయస్కుఁడై యున్నపుడే మరణింపవలసినవాఁ డయ్యు, బుద్ధిబలముచేతను కదా చిరంజీవి యయ్యెను! కనుక బుద్ధిబలమట విధివిధానము ద్రోయలేదా?" అనెను. అందులకుఁ బురూరవుం డిట్లు సమాధానమిచ్చెను. "మహా భాగా! ఆ బుద్ధి విధిననుసరించియే పుట్టినది. విధివిధాన మట్లుండ బట్టియే యాతఁడు శివునిగూర్చి తపమొనరించుటయుఁ దదనుగ్రహంబు నకుఁ బాత్రుఁడగుటయుఁ దన్మూలమునఁ జిరంజీవియగుటయు సంభవిం చెను; బుద్ధి నొసటివ్రాలుపై నాధారపడియుండును; సర్వమునకు విధివిధానమే యాజమాన్యము వహించియుండును; దానినిమించినదేది యునులేదు." ఆ సమాధానమునకు బ్రాహ్మణవేషధారులగు దేవతలు సంతృప్తిఁజెంది నిజరూపములతో సాక్షాత్కరించి యాదంపతుల నాశీర్వ దించి, దేవలోకమున కరిగిరి. శనైశ్చరుఁడు తనప్రభావమును జూపింప దగిన కాలమంతయును జెల్లిపోవుటచేతఁ బ్రశాంతచిత్తుఁడై పురూరవ మహారాజు నొద్దకువచ్చి, "రాజా! ఒకప్పుడు నేను నీయొద్దకువచ్చి వార్ధకమున నిన్నుఁ బట్టుకొనుమందువా, యౌవనమునఁ బట్టుకొను మందువాయని ప్రశ్నించితిని. అపుడు నీవు యౌవనముననే పట్టుమని నాకుఁ జెప్పితివి. తదాది ఆఱు సంవత్సరములును, మఱియొక సంవత్స రమును మొత్తమేడేండ్లు నేను నీపై విజృంభించి నాశక్తిని బ్రయోగిం

చితివి. నీవు ధర్మమునుదప్పక, ప్రశాంతభావముతో మహాజ్ఞాన సంపన్నుఁడవై కష్టములెల్ల సహించితివి. ఇఁక నేను నిన్నేమియుఁ జేయఁజాలను. నిన్ను విడిచిపోవుచున్నాను. నీవు తొంటిసౌఖ్యములెల్ల ననుభవింపుము." అని యాతనికి వలసిన వరములిచ్చి, తన నివాసమునకుఁబోయెను. పిమ్మట బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ముగ్గురును పురూరవునకు సాక్షాత్కరించిరి. ఆతఁ డమందానంద హృదయారవిందుఁడై చేతులుమోడ్చి భక్తియుక్తముగా పలువిధముల వారిని శ్లాఘించెను. వారాతని యందనుగ్రహముంచి, కాలు సేతులు మరల నెప్పటియట్లు వచ్చునట్లు వరమిచ్చి, యంతర్ధానమొందిరి. పుష్పాంజలియుఁ దనభర్త యొక్క ఆధిక్యతను గన్నులారఁ గాంచుచుండుటచేఁ దన మనమున నిర్భరానందమును బొందుటమాత్రమేకాక, మహిమాన్వితుఁడగునట్టి చక్రవర్తిని చేపట్టఁగలిగినందులకు దైవమునకుఁ దన కృతజ్ఞతను సగర్వముగాఁ దెలుపుచుండెను. ముప్పొద్దులందును సరస్వతీదేవి, దివ్యాన్నమును, దివ్యామృతమును, తక్కుంగల యాహారపదార్థములను దెచ్చి ఆదంపతుల కిరువురకుఁ బెట్టిపోవుచుండెను. ఆమెకు మార్గమధ్యమునందుఁ గొందఱు జనులు కనఁబడి, "అమ్మా! ఆయెదుటనున్న భవనమెవరిది? నీవక్కడికేల వెళ్ళితివి? ఆభవనము నింతకు ముందెన్నడును మేము చూచియుండలేదు. అయ్యది నూతనముగా నిర్మింపఁబడినట్లున్నది." అని యడిగిరి. సరస్వతీదేవి వారితో, "ఆభవనమునందు ఒక దివ్యపురుషుఁడు తన సతీమణితో వాసముసేయుచున్నాఁడు. ఆమహాత్ముని సందర్శించినంతమాత్రానఁ గనులు లేనివారికి కనులును, కాళ్లులేనివారికి కాళ్లును, మూగవారికి మాటలును వచ్చును. వ్యాధిగ్రస్తు లారోగ్యవంతు లగుదురు. నిఱుపేదలు ధనికులగుదురు." అని నుడివి దేవలోకమునకుఁబోయెను. నాఁడు మొదలుకొని కుంటివారు, గ్రుడ్డివారు, కుష్ఠరోగులుమున్నగువారు తండోపతండములుగా పురూర

రవుండు పుష్పాంజలీ సమేతుఁడై నివసించుచున్న బంగారు మేడలోనికిఁ బోయి, ఆతనిని దర్శించి రోగవిముక్తిం బడసి, సంతోషభరిత మనస్కులై పోవుచుండిరి. మఱియు నిప్పచ్చరమునఁ దొప్పదోఁగు నిర్భాగ్యులు ధనికులై యానంద మనుభవింపఁబోవుచుండిరి. ఆనిర్జన ప్రదేశములో నతినూతనముగా నొక బంగారు మేడ యేర్పడుటయు నందు దివ్య పురుషుఁ డొకఁడు భార్యా సమేతుఁడై నివసించుచుండుటయు, వానిని దర్శించినంతమాత్రానఁ బ్రజలభీష్ట సిద్ధులగుచుండుటయు లోను గాఁగల విషయములను పుష్పాంజలిజనకుఁడు కర్ణాకర్ణికగా నాలకించెను. అప్పటినుండియు నాప్రదేశమును, ఆమేడను, మహిమాన్వితుఁడగు ఆనూతన పురుషుని దర్శింపవలయునని తలంచి యమ్మహీజాని యువ్వి ళులూరుచుండెను. అతఁడు మృగయావిహారార్థ మేతెంచి, తత్పరిస రారణ్యములందున్న భయంకర వన్యమృగసందోహములనెల్లఁ జెండా డెను. పిమ్మటఁ బరిజనులతోను, భార్యతోను, బయలుదేరి పురూర వుఁడున్న మందిరమునకు వెళ్లెను. ఆతఁడు తన వారితో మందిరప్రాం గణమున నిలువఁబడియుండఁగా, రోగులెందఱో లోనికిఁబోయి, మరలి వచ్చునప్పు డారోగ్యవంతు లగుచుండుటఁ గాంచి విస్మయమందెను. ఆతఁడు తన భార్యయగు తిలకవతిని జూచి, "ప్రేయసీ! మన పుత్త్రిక పుష్పాంజలి యాకుంటివానిని బెండ్లాడి వానితోఁగూడ నడవులంబట్టి పోయినది. ఆమె జాడం దెలిసికొనుటకుఁ జారుల నెందఱినో పంపితిని; కాని లాభమావంతయుఁ గలుగుటలేదు. ఆమె యిప్పు డెక్కడ—ఏస్థి తిలోనున్నదో యీభవనమునందున్న దివ్యపురుషు నడిగినఁ దెలియఁ గలదు—రమ్ము." అని యామెను వెంటనిడుకొని లోనఁ బ్రవేశిం చెను. పురూరవుండు వారిని దన యత్తమామలుగా వెంటనే గ్రహిం చెను. భార్యాసమేతుఁడై యెదురేఁగి, అత్తమామలకు నమస్కరిం చెను; కాని, వారు మాత్రము దమ యల్లునిగాని, కూతునుగాని

గుఱుతింప లేకపోయిరి. "ఆర్యా! నేటికిఁ గొలఁది మాసములక్రిం దట మాయనుంగుబిడ్డ కాలు సేతులు లేని యొక కుంటివానిని బెండ్లి యాడి, రాజ్యభోగాదులు విడిచి, వానితోఁగూడఁ గానకుఁ బోయినది. ఆమె జాడను దెలిసికొనఁగోరి పెక్కుమందిచారులను బంపితిని; ఎవరును దెలిసికొనలేకున్నవారు. తాము భగవదంశ సంభూతులనియుఁ దమ్ము దర్శించినమాత్రాన వ్యాధిగ్రస్తులారోగ్య భాగ్యమును, దరిద్రులు సం పదలను పొందుచున్నారని విని, మాబిడ్డజాడ తమనుండి తెలిసికొన గోరి యిటు వచ్చియున్నాను; కరుణింపుఁడ" ని మామగారనెను. ఆపలుకు లాలకించి పురూరవుండు బిగ్గఱగా నవ్వెను. పుష్పాంజలి తల్లిదండ్రుల కాళ్లపైఁబడి, "జననీ జనకులారా! నాఁడు కుంటివానిని వరించితినని నన్ను దూషించినారు; నామూలమునఁ బ్రాణత్యాగము నకుఁగూడ సిద్ధపడినారు. ఆకుంటివాని మహిమ యీనాఁడు మీకు బోధపడినదా? ఆమహనీయుఁ డెవ్వఁడోకాఁడు. చతుస్సముద్రముద్రి త ధరామండలము నేకచ్ఛత్రాధిపత్యముగా నెవ్వఁడు పాలించెనో ఎవ్వాని యశశ్చంద్రికలు పండువెన్నెలలవలె జగమునందెల్ల వ్యాపిం చినవో, ఏఁబదియాఱు దేశములనేలు భూపతులు నెవ్వానిపద సరోజం బులుకడ నానావిధామూల్య మణిప్రభాభాసిత కిరీటముల నుంచెదరో ఎవ్వఁడు ముక్కోటి దేవతలచేతను గీర్తింపఁ బడుచున్నవాఁడో, త్రిమూర్తు లెవ్వనియందుఁ బ్రసన్నులై వర్తింతురో, సరస్వతీదేవి యెవ్వానికి సుఖంబు కూర్చుతల్లియో, అట్టి శ్రీ శ్రీ శ్రీ పురూరవ సార్వభౌముఁ డాతఁడే! కాలవైపరీత్యమువలనను, శనిప్రేరణమువల నను, రాజ్యముం గోలుపోయి కష్ట నష్టములుపొంది నికృష్ట జీవనము గడపెను." అనఁగా వారు తెల్లఁబోయిరి. చంద్రవంశకులదీపకుండును, భగవదంశ సంభూతుఁడును అగు పురూరవుని దమజామాతగాఁ బడసి

నందులకు వారెంతయు సంతోషించి, భగవంతునకుఁ దమ ధన్యవాదములు సమర్పించిరి. అంతలో సరస్వతీదేవి దివ్యములగు నాహారపదార్థములం గొనితెచ్చెను. పుష్పాంజలి, తన తల్లిదండ్రుల నాలోకమాత్ర కెఱిఁగించెను. వారు భక్తియుక్తులై సరస్వతీదేవికి మ్రొక్కి యామె వలన నాశీస్సులంబొంది, మహదానందమందిరి. అంతలోఁ గర్ణాకర్ణికగా విని, పరదేశి కావలిసెట్టియు నక్కడకు విచ్చేసెను. ఆవర్తకశిఖామణిని జూచుటతోడనే, పురూరవుండు హర్షాతిరేకముచేఁ గలిగిన యొడలి గగుర్పాటుతో నాతనిఁ గౌఁగిలించుకొనెను. సరస్వతియు నా సహృదయు నాశీర్వదించి దేవలోకమునకుఁ బోయెను.

—♦ పురూరవుని సౌఖ్యదశ. ♦—

తరువాత పురూరవుని మామగారును, పరదేశి కావలిసెట్టియు నాలోచించి యూపరిసరారణ్య ప్రదేశమును పరిశుభ్రము చేయించిరి. దర్శనీయమగు నొకమహానగరమును పురోహిత నిర్దిష్టమగు నొక ముహూర్తమును నిర్మింపఁజేసిరి. అయ్యది క్రమక్రమముగా సుందర మందిరములతోడను, హృద్యోద్యానములతోడను, నిర్మలనీరపూరిత కాసారములతోడను, విశాలములగు వీథులతోడను, అంగళ్ళతోడను, వస్తుప్రదర్శనశాలలతోడను, కర్మాగారములతోడను, యంత్రనిలయములతోడను, నాటకశాలలతోడను, నిండియుండి యమరావతిని, అలకాపురమును, ప్రతిష్ఠాననగరమును ద్రోసి రాజనుచుఁ జూడవేడుకగా నుండెను. భండనభీములగు సత్క్షత్రియులును, సకలాగమ రహస్యకోవిదులును, సదాచార సంపన్నులునగు బ్రాహ్మణులును, గుబేరసదృశులగు వైశ్యులును, స్వామిభక్తి తత్పరులగు శూద్రులును, ఆనగరమునందుఁ గలరు. అందు జార చోర వ్యాధి భయములుగాని, అతివృష్ట్యనావృష్టి పీడలుగాని మచ్చునకయినను లేవు; అకాల మరణములు లేవు.

ధర్మము నాలుగు పాదములతో వర్తించుచుండెను. అమ్మహానగరమును పెద్దల యనుమతంబునఁ బురూరవుండు జనానురంజకముగాఁ బాలించుచుండెను. అతని ప్రఖ్యాతి దశదిశలు వ్యాపించెను. నూతన నగర నిర్మాణమును గుఱించుఁ దదధిపతియగు పురూరవుని పరిపాలనాదక్షతను గుఱించియుఁ బ్రజ లతిచిత్రముగాఁ గథలు క్రిందఁ జెప్పుకొనఁ దొడంగిరి. ఓధర్మనందనా! వినుము. సంపదలైనను, శుభములయినను ప్రాప్తయోగ మున్నప్పుడు అప్రయత్నముగాఁ దమంతఁదామే సిద్ధించుచుండును. ఆటఁ బ్రతిష్ఠాన పురమునందలి ప్రధానామాత్యుఁడు—రాత్రిసమయమునఁ బురూరవ మహారాజు భార్యాపుత్రులతో నగరు విడిచి వచ్చుటచేత మఱునాఁడు వారిని గానక యెంతయుఁ జింతించెను. రాచకుటుంబమును గనుఁగొనవలెనని యాతఁడు నాఁడే ఆలుబిడ్డలతో బయలుదేరెను; దేశదేశములు తిరిగెను; వాడవాడలు వెదకెను; కొండలు, ఏళ్ళు, అడవులు, గుహాలు, చెట్లు, పుట్టలు, ఆలయములు, సత్రములు, చౌకలు, న్యాయస్థానములు, విలాసమందిరములు, కేళీగృహములు—ఇవి యవి యననేల? భూమ్యాకాశము లెల్లయెకలఁ గలయఁజూచెను. కాని పురూరవునిజాడ గనఁబడలేదు. ఆతఁడు విసివి, వేసారి, బెంగగొని, సన్యాసి వేషముతోఁ దీర్ఘయాత్రలు సేయుచుండెను. నూతనముగా నిర్మింపఁబడిన నగరసామ్రాజ్యమును శుచిమంతుఁడను పేరుగల యాప్రధానామాత్యుఁడు వచ్చి కర్ణాకర్ణికగా, ఆనగర సౌందర్యమును గుఱించియు, దానిని బాలించు ఱేని ప్రతిభావిశేషంబును గుఱించియు నాలకించి, "ఆహా! మున్నెన్నఁడు నిట్టి వింతను జూచినది; విన్నది లేదు. ఈనగరమును బాలించుచున్న యొడయఁడు తప్పక మామహారాజగు పురూరవ సార్వభౌముఁడే కావలయును; పోయి విచారింతునుగాక! అనుకొని, నగరమును బ్రవేశించి, అదను కనిపెట్టి రాజసందర్శన మొనరించెను. తోడనే పురూరవ శుచిమంతు

లొకరి నొకరు గుఱుతించిరి; ఇరువురు నానందాతిశయముచేఁ గలిగిన బాష్పధారలు రాల్చుచు నొకరి కుశల మొకరడిగి తెలిసికొనిరి. "శుచిమంతా! ఇదేమి? నీకీ సన్యాసివేష మెట్లువచ్చినది? నీవియ్యెడ కెట్లు వచ్చితివి?" అని పురూరవుఁడు మంత్రినిఁ బ్రశ్నించెను. "మహాప్రభూ! అర్ధరాత్రి సమయమున నితరు లెవరును జూడకుండ మీరును మహారాణిగారును, శ్రీయుతులగు బిడ్డలును బ్రతిష్ఠాన నగరమును విడిచితిరి. మఱునాఁడు మిమ్ములంగానక, పరితపించి, మిమ్ములను వెదకుటకు బయలుదేరితిని. ఇన్నిదినములకు నాయాశయ మీడేరినది. నాకష్టము ఫలించినది. ప్రభూ! దేవేరియు, బిడ్డలు నెచ్చటనున్నవారు? అని మంత్రి యడుఁగగా, "ప్రధాన సచివోత్తమా! శనైశ్చరుని ప్రభావమునవలన మేమెల్లరము విడిపోయితిమి. ఇంతవఱకు నొకరి క్షేమ మింకొకరికి తెలియబడకున్నది. శనైశ్చరుఁడు మన యందిపుడు సుప్రసన్నుఁడై యున్నవాఁడు. మన యాపదలన్నియుఁ జెల్లిపోయినవి; శుభకాల మాసన్నమయినది. దేవేరియును, బిడ్డలును దమకుఁ దామే యచిరకాలములోనే రాఁగలరు. నీవంతదనుక నిందే యుండుము." అని నుడివి శుచిమంతుని చేయూఁతతో నమ్మహారాజు రాజ్యపాలనము సాఁగించుచుండెను.

ఓ యుధిష్ఠిరా! వినుము— అట గొల్లదానియింటఁ బెరిగి పెద్దవారయిన రాకుమారు లిరువురును దమ పెంపుడు తల్లితో నొక్క దినమున నిట్లనిరి. "అమ్మా! చిరకాలమునుండి మేమీ పల్లెయందే కాలము గడుపుచున్నారము. వివిధ దేశములుచూచి, మా విద్యావైశద్యమును మహారాజుల యొద్దఁ బ్రదర్శించి, దానికి. దగిన మెప్పుబడయ వలెనన్న కుతూహలము మాకు మెండుగాఁ గలదు. కాఁబట్టి మమ్ముల నాశీర్వదించి పంపవలయున" నిరి. ఆ మాటల కామె విచా

రించినది. "బిడ్డలారా! మిమ్ములను నా ప్రాణములకంటె మిన్నగా నెంచి పెంచుచున్నాను; ఒక్కక్షణము మీరు కనఁబడకున్న నేను బ్రతుకఁజాలను. మీరు దేశసంచారము నభిలషించుచున్నారు. అది ముగించుకొని యెప్పటికి వత్తురో! అంతదనుక నేను బ్రతుకఁగలనా? మఱియు విద్యాకౌశల్యమునుజూపి మహారాజుల మెప్పుఁ బొందఁగోరుచున్నారు. అయ్యది మీ కేల? మీకు వలసినంత భాగ్యము నాకడనున్నది. మీ కంటె నాకాప్తు లెవ్వరును లేరు; దానినిమీరు మీయిచ్ఛవచ్చిన మచ్చున కర్చు సేసికొనుఁడు. ఏలుబడి సేయవలయుననన్న కుతూహలము మీకున్నచో దానితో నొక రాష్ట్రమును, దానికిఁదగిన రాణువను నిర్మించుకొనుఁడు; కాని నన్ను విడిచి పోకుఁడు. అని యామె యన్నది. "అమ్మా! నీవు విచారింపఁబనిలేదు. మేమాజన్మాంతము నీయెడ గృతజ్ఞులము. మీఁదుమిక్కిలి కన్న తల్లిదండ్రులకంటెను గూడ నీవే మా కాపురాలివి. నీయొద్దనున్న ధనము వ్యయముసేసి రాష్ట్ర నిర్మాణ మొనరించి, దానిని బాలించునంత మాత్రాన మాకు సంతోషము గలుగదు. లోక మశాశ్వతము; దేహమస్థిరము; కీర్తియే నిత్యమయినది; కీర్తి కాముఁడగు పురుషుఁడే పురుషుఁడు. పేరుప్రతిష్ఠలనార్జింపకుండ బ్రతికిననేమి? బ్రదుకకున్న నేమి? తల్లీ! మేము కీర్తి సంపాదింపవలెనని బయలుదేరుచున్నాము. మరలఁద్వరలోనే నీచెంతకు రాఁగలము. కనుక మమ్ముల నాశీర్వదించి పంపుము "రాకుమారులు మాఱువలికిరి. గొల్లభామ మాఱువలకలేక, తుదకంగీకరించి, ప్రయాణోచితమయిన శుభముహూర్తమొండు నిశ్చయించి, వారికి మహోన్న తాజానేయములను, అమూల్యాభరణములను, మృదులదుకూలములను, ఆభరణములను వలసినంత ద్రవ్యమును ఇచ్చి, హృదయ పూర్వకములగు దీవనలిచ్చి పంపెను. ధర్మరాజా! వినుము. ఆ రాకుమారులు దేశదేశములు తిరిగి, తుదకుఁ బురూరవ పరిపాలిత

మగు నూతన నగరమునకు వచ్చిరి. ఆ నగరమును గుఱించియు, దాని ఱేని ప్రభావమునుగుఱించియు నక్కడి ప్రజల వలన నత్యాశ్చర్యముగా నాలకించిరి. అమ్మహారాజును సందర్శించి, తమ విద్యా కౌశల్యము బ్రదర్శించి యాతని యాస్థానమునం దున్నతోద్యోగములు సంపాదించి మెప్పు పొందవలయునని యన్నదమ్ము లిరువురును నిశ్చయించుకొనిరి. మరునాఁడు పురూరవుఁడు మంత్రి పురోహిత దండనాథ సామంత వందిమాగధ పుర ప్రముఖోద్యోగి జన ప్రభృతులతోఁ గొలువుదీఱియుండఁగా రాకుమారు లుచితవేష భూషలతో నచ్చటి కేతెంచి, ముందుగాఁ బ్రతీహారుల వలనఁ దమ రాకను ఱేనికెఱిఁగించి, తదనుమతింబడిసి పిమ్మట రాజు నెదుటికివచ్చి, సవినయముగ నమస్కరించి నిలువంబడిరి. వారి రూప రేఖా విలాసాదుల నవలోకించుటతోనే పురూరవుని నేత్రము లశ్రుపూరితము లయినవి. ఆతని మనము సందాందోళ ముదయించినది. " ఇదేమి? వీరు నాబిడ్డలవలెనున్నారు?... కానిమ్ము. నేను తొందరపడనేల ? నిజము నిలుకడమీఁద దేలఁగలదు! వీరు నా బిడ్డలనుట నిస్సందేహము కాని లోకమునకీ విషయము విస్పష్టము గావలసియున్నది. " అనుకొని యాతఁడు, " రాకుమారులారా! మీ రాకకుఁ గారణమేమ " ని యడిగెను. " రాజా ! మేము నీమహిమాతిశయమునుగుఱించి వినియున్నాము. నీయొద్ద నుద్యోగముసేయు తలంపుతో వచ్చియున్నాము. నీకంగీకారమయిన దినమున కొక్కొక్కనికి రెండువేల వరహాల వేతనము చొప్పున నీయుమ " ని వారు బదులు నుడివిరి. వారి వాగ్ధోరణికిని, తేజమునకును, తెలివి తేటలకును, సభికు లాశ్చర్య మొందుచుండిరి. పురూరవుఁడు వేతనమునకు సమ్మతించెను. వారాతనియొద్ద నాఁటినుండియు నుద్యోగమునకుఁ గుదిరి నిర్ణీత వేతనము పుచ్చుకొనుచుఁ దమకు వ్యయముకాఁగా మిగిలిన సొమ్మును బీదలకు దానము సేయుచుండిరి. వారికీర్తి యెల్లయెడల

వ్యాపించెను. ఈ రీతిని గొంత కాలము గడచినది. ఓ ధర్మజా ! వినుము. అట సముద్రతీరమునందుఁ గట్టఁబడిన మేడలో నివసించుచున్న నవకోటి నారాయణసెట్టి కర్ణాకర్ణికగా నూతన నిర్మితంబగు పట్టణము నేలుచున్న మహారాజు దివ్యమహిమాన్వితుండని, మందసమును ఆతనికడకుఁ గొంపోయినచో నయ్యది తెఱువ బడఁగలదని విశ్వసించి దాని నోడమీఁద నెక్కించుకొని కతిపయ దినంబులకా నగరమును జేరెను. ఆమందసమును సముద్ర మధ్యము నందున్న యోడయందే యుండనిచ్చి తాను మాత్రము బయలుదేరి, నూతననగరమును ప్రవేశించి, పురూరవమహారాజు నిండుకొలువై యుండగా నతనిని సందర్శించి, చేతులుమోడ్చి, సవినయముగా నిట్టులనెను. "మహాప్రభూ ! ఇప్పటికిఁ గొన్ని దినములకుఁ బూర్వమొక లేఖకుఁడు భార్యా సమేతుఁడై మా నగరమునకు వచ్చియుండెను ; నేను ద్రవ్యాగమనము గాంక్షించి సత్కార్యములాచరింపఁ గోరి, ఆలయగోపుర ప్రాకారతటాకాదుల నిర్మింపించుచుఁ గూలివాండ్ర నాపనులకు నియోగించితిని ; వారు తమకూలికొఱకు భార్యలను నా ధనాగారమునకుఁ బంపవలసినదిగా నేను కట్టడి సేసితిని. నాయాజ్ఞ ననుసరించియే యాగణకుఁడును దన భార్యను నాయొద్దకుఁ గూలికొఱకుఁ బంపుచుండెడివాఁడు. మహాప్రభూ ! క్షమింపుఁడు. చేసినపాపము చెప్పినఁ బోవునందురు. ఆమె చక్కఁదనమునకు నే నక్కజపడితిని. ఆమె సాంగత్యమును నే నభిలషించి, షరాబుతో నాచిన్నదానిని నా యంతఃపురమునకుఁ బంపుమంటిని. అమాయకురాలగు నాసాధ్వి కూలికొఱకు రాగా షరాబు ఆమెను నాయంతిపురికిఁబోయి కూలి తెచ్చుకొనుమనిచెప్పి, పంపినాఁడు. ఆమె నా శయనాగారమునఁ బ్రవేశించినదఁట! నేను నలంకరించుకొని లోనఁ బ్రవేశించునరికామె నాకంటఁబడలేదు. ఆగదినుండి యెక్కడికయినఁ దప్పించుకొని పారిపోయెనేమో యని నే నెల్లయెడల వెదకితిని. తుదకా గదిలోనొక పెద్దమందసము

నాకంటఁబడినది. దానినంతకు బూర్వము తెఱచి యుంచితిని. కాని నేను చూచునపుడయ్యది మూయఁబడి యున్నది. ఆసుందరాంగి యామం దసములో దాగియున్నదని యూహించితిని. ఆమె భర్త అచ్చటకి వచ్చినచో మోసము వెల్లడియగునని భయపడితిని. భృత్యులను పిలిచి యామందసమును గొడ్డళ్ళచేఁ బగులఁగొట్టింపఁ బ్రయత్నించితిని. గొడ్డళ్లు తుత్తునియలైనవి కాని పేటిక చెక్కు చెదరలేదు. ఆగదికి నిప్పు వెట్టించితిని. భవనమంతయు దహింపఁబడినది కాని పెట్టె కాల లేదు. ఓ మహారాజా! ఆ పెట్టెను నాశము చేయవలెనని నే నెన్నో విధములఁ బ్రయత్నించితిని. కాని నా ప్రయత్నము లన్నియు నిష్ఫ లములయినవి. తుదకు దానిని సముద్రమధ్యమున ముంచివేయవలెనని యెంచితిని. భృత్యులచే సముద్రతీరమునకుఁ బట్టించుకొని పోయితిని. అపుడందున్న వనితారత్నము, "సెట్టీ! పెట్టెభ్రమలకు లోను గావ లదు——నాకొక వ్రతమున్నది. ఏడేండ్లవఱకు నీ పెట్టె తెఱువఁబడదు. దీనిని నీ వేరీతిగను, ఎన్నటికిని నశింపఁజేయలేవు. కాఁబట్టి దురభి ప్రాయమును విడువమని హితోపదేశ మొనరించెను. నేను పరిపూర్ణ ముగాఁ బశ్చాత్తాపము నొందితిని. కాని నగరములోనికిఁ బోయిన యెడల తేనివలన నెట్టి యుపద్రవము కలుగునోయని నేను భయపడి, ఆ సముద్రతీరమునందే యొక మేడను గట్టుకొని నివసించుచు, రాత్రిం బవళ్ళు బహు భద్రముగా పెట్టెను కాపాడుచున్నాను. దేవా! ఆ స్త్రీరత్నము పెట్టెనగడువు తీఱిపోయినది. ఆమెను నేనిపుడు నాత ల్లిగా భావించుచున్నాను. అన్నవస్త్రములుగాని, పానీయ వాయువులు గాని లేకుండ నామె యాపెట్టెయందుండగలుగుట సామాన్య విష యముగాదు. ఆమె మహా పతివ్రత యని నేను గ్రహించితిని. ఆమె కిపుడు విముక్తి గలిగింపవలసియున్నది. తాము దివ్య ప్రభావ సంక ల్పితులని ప్రజలు వాకొనఁగా నాలకించి, తమవలన నేదయిన నుప

కారము జరుగునేమోయని తలంచి యీ మందసము నోడపై నెక్కించు కొని యీ నగరమునకు వచ్చితిని. ఓడ సముద్ర మధ్యమునందున్నది. ప్రభూ! ఆపెట్టెను దెఱచుట కుపాయమాలోచింపుఁడు.” పురూరవుం డీపలుకులన్నియు నత్యంతాశ్చర్యముతో నాలకించెను; తనభార్య యొక్క సాధ్వీత్వమునకు లోలోన హెచ్చుగా మెచ్చుకొనెను. కాని యీ సాధ్వీత్వము ముల్లోకములకు వెల్లడిచేయవలయు ననుకొనెను. వెంటనే సేవకులను బిలిపించి, “మీరు సర్వవిధములఁ బ్రయత్నించి యోడయందున్న మందసమును దెఱువుఁడు”. అనెను. “ఓహో! ప్రభూ! ఇది యెంతపాటిపని”! అని వారు బీరములువలుకుచుఁ గత్తులు, సుత్తులు, కారులు, గొడ్డళ్లు మున్నగు పరికరములెన్నియో పట్టుకొని సముద్రమధ్యమునందున్న యోడయొద్దకుఁబోయి దానిలోనున్న మంద సమును సమీపించి, మూఁతనుదీయఁ బ్రయత్నించిరి. వేలకొలది కూలివాండ్రనుగూడఁ గొనివచ్చిరి. ఎవరెంత కష్టించినను లాభము లేకపోయినది. వారు రాజు పాలికింజని జరిగిన సంగతులు విన్నవించిరి. రాజు మందహాస మొనరించి, “కోటలోని యేనుఁగులను దోడ్కొని పోయి, ఆ మందసమును దీరమునకుఁ జేర్పుఁడ” ని చెప్పివంపెను. వేయి యేనుఁగులు వచ్చి యినుపగొలుసులచేఁ బెట్టెనిగట్టి యీడ్చినను, అయ్యది యొక అంగుళము మేరయయినఁ గదలలేదు. అపుడు ప్రజ లెల్లరు నక్కజమొంది, పరుగు పరుగునఁ బ్రభుని యొద్దకుఁబోయి, “దేవా! ఏమి చెప్పుదుము? ఆపెట్టెలో బ్రహ్మరాక్షసి యున్నదో! భూతమున్నదో! దయ్యమున్నదో! లేక దానికి సంబంధించిన మంత్ర తంత్రములేవయిన నున్నవో! కాక యది దైవమాయయో! ఎటుం గంజాలము. వేయిమంది బలవంతులు ఆయుధపాణులయ్యు దానిమూఁ తను దీయలేకపోయిరి సరికదా, వేయి యేనుఁగులు గుమిగూడియు దానిని గదలింపలేకపోయినవి. మేమిట్టి చిత్రమును మున్నెన్నఁడును

గని విని యుండలేదు. రాత్రి కానున్నది. ఆ యోడయందున్న యితర వస్తువు లేవియు నపహరింపఁబడకుండఁ దగినవారి నక్కడకుఁ గాపుండఁ బంపుఁడ" ని పలికిరి. పురూరవుండు తనయొద్ద దినమునకు రెండువేల వరహాల వేతనము నిర్ణయించుకొని యుద్యోగమునకుఁ గుదిరిన రాకుమారుల నిరువురను బిలిచి, "మీరీ రాత్రి సముద్రమధ్యమునం దున్న యోడను బరిరక్షింపవలయున" నఁగా, వారు "చిత్తమ" ని సాయంతన మగుటతోనే, యచ్చటకుఁ బోయిరి. వా రోడయొక్క యుపరిభాగము నెక్కి యందున్న మందసమునకు సమీపముగాఁ గూర్చుండిరి. వారిలోఁ జిన్నవాఁడు పెద్దవానితో, "అన్నా! కాల క్షేపమునకుఁ గాను ఏదియయిన నొకకథను జెప్పుమనఁగా నాతఁడు, "సోదరా! వేఱేకథ చెప్పనేల? మనచరిత్రము కథవలె మిగులఁ జిత్రముగా నుండును. దానిని నీ కెఱిఁగించుచున్నాను— వినుము. ప్రతిష్ఠాన నగరమును పురూరవుఁడను సద్యశోవిశాలుండగు సార్వభౌముఁడు పాలించుచుండెను. సూర్యపుత్రుండగు శనైశ్చరుఁ డాతనిని కష్టముల పాలుచేసెను. అందువలనఁ బురూరవుండు చంచలచిత్తుఁడై యొక్క నిశీథసమయమునఁ దన భార్యతోను, ఇరువురు సుతులతోను నగరమును విడిచి యడవులపాలాయెను. తుదకాతఁ డొకపట్టణమును జేరి యందుఁ గొందఱు కూలివాండ్ర సాహాయ్యమున లేఖకోద్యోగియై మాఱువేషముతో జీవనము సేయుచుండెను. ఆతఁ డొక్కవాఁడు భార్యను బోఁగొట్టుకొని కుమారులతో నొకనదిని దాటుచు వెల్లువ యందుఁ గొట్టుకొనిపోయెను. అంత నాబాలుర నిరువుర నొకగొల్లభామ పెంచి పెద్దవారింజేసి, విద్యాబుద్ధులు నేర్పించినది. ఆ సుతు లెవ్వరో కాదు—మనమేయని మన యాచార్యుఁడగు నుపమహర్షి యానతిచ్చెను గదా!" అనెను. ఆ కథను మందసమునందున్న జయప్రదాదేవి యాలకించినది. ఆ రాకుమారు లిరువురును దప్పక తినకుమారులే

యనుకొని, తక్కుంగల కథావిశేషమును వినఁగోరి పెట్టితోఁగూడ వారియొద్దకు జరిగినది. అట్లు జరుగుటను వారు చూచి, "ఇదేమి చిత్రము! మనము పురూరవసార్వభౌముని కథ చెప్పుకొనుచుండఁగా నీపెట్టె జరుగుచు మనచెంతకు వచ్చినది; కాఁబట్టి యీపెట్టెకును మనకును నేదియో సంబంధముండియే తీఱును. దీనిని దీరమునకుఁ జేర్ప వలయునని నేఁడు రాజాజ్ఞపై సేవకులు మిక్కిలి ప్రయాసపడిరిగదా! మనము మనకథను జెప్పుకొనుచుఁ దీరమునొద్దకుఁ బోవుదము. ఇది కూడ మనవెంట వచ్చునేమో చూతము" ని, ఓడనుండి దిగి తమ చరిత్రమును కథగాఁ జెప్పుకొనుచుఁ దీరమునకుఁ బోయిరి. వారి వెనువెంటనే యామందసముకూడ జరిగి తీరమును జేరుకొన్నది. వారు తమ యాశయము ఫలించినందులకు మిక్కిలియు సంతోషించి, మఱు నాఁడు తెల్లవాఱుటతోనే రాజసమ్ముఖమునకుఁ బోయి, "ప్రభూ! మందసము తనంతఁదానే సముద్రతీరమునకు వచ్చిచేరినది." అని నుడివెను. సభలోనున్నవా రెవ్వరును ఆ మాటలను విశ్వసింపకుండిరి. వారెల్లరును సముద్రతీరమునకుఁబోయి చూచిరి. రాకుమారులు చెప్పినదెల్ల సత్యమని రాజునొద్దకు వచ్చి చెప్పిరి. ఆమందసమును గనుఁగొనవలెనని రాజు పుష్పాంజలిని, అత్తమామలను, పరదేశికావలి సెట్టిని దక్కుంగల వారిని వెంటఁబెట్టుకొని సముద్రతీరమునకుఁ బోయెను. "మందసము సముద్రమధ్యమునందు నిలిచిన యోడనుండి తీరమునకు వచ్చుటకు మీరేమిచేసితిర" ని పురూరవుఁడు రాకుమారులతోఁ జెప్పఁగా వారు గతరాత్రి గడచిన కథయెల్లచెప్పిరి. అంత సరస్వతీదేవియు, శనైశ్చరుఁడును, నవకోటినారాయణసెట్టియు నటకు వచ్చిరి. సరస్వతి, "ఓ పురూరవసార్వభౌమా! ఈ రాకుమారు లిరువురు నీకుమారులు; ఈ మందసమునందున్నది నీభార్యయగు జయప్రదాదేవి. ఆమె తన పాతివ్రత్యప్రభావముచేత నీయేడేండ్లు అన్న

వస్త్రాదులు లేకున్నను సురక్షితమై యున్నది. నాభర్త స్పృశించినపుడే మీపెట్టె తెఱువఁబడవలయునని యామె కోరినది. కాఁబట్టి నీవు దీనిని దాఁకుమ" నెను. పురూరవుఁడు నిర్భరానందముతో నాపెట్టెను దాఁకఁగా నది తెఱువఁబడెను. అందుండి జయప్రదాదేవి వెలువడి తొలుత భర్తృపాదారవిందములకును బిమ్మటఁ దక్కుంగల వేల్పులకును నమస్కరించెను. రాకుమారులా రాజే తమతండ్రియగు పురూరవుఁడనియు నామందసమునందున్న యామె తమ కన్నతల్లియగు జయప్రదాదేవి యనియుఁ దెలిసికొని యింతింతనరాని సంతోషమును జెందిరి. మాతాపితరులకు నమస్కరించి వారి యాశీస్సులంబొందిరి. పుష్పాంజలి జయప్రదాదేవి పాదములకు మ్రొక్కఁగా, సరస్వతి యయ్యిరువురకును బరిచయము గల్పించి యనేకవరములొసంగి యంతర్ధానము నొందెను. శనైశ్చరుఁడు, "పురూరవసార్వభౌమా! కష్టము లెన్నిసంప్రాప్తమయినను, భార్యాపుత్త్రుల నెడఁబాసినను, న్యాయము దప్పక, ప్రశాంతభావమును విడువకయున్నందులకు నేనెంతయును సంతసించితిని. నీ చరిత్రమును వ్రాసినవారియందును, వినినవారియందును, చదివినవారియందును, చెప్పినవారియందును నేను గరుణాళుండనై వర్తింతును; నీకు సర్వశుభములు గలుగుఁగాక!" అని వరమిచ్చి యంతర్ధానమొందెను. పిమ్మట నెల్లరును ఆనందసాగరమున నోలలాడుచు నంతఃపురముం జేరుకొని యిష్టమృష్టాన్నములు భుజించిరి, సమస్తదానము లాచరించిరి. మహోత్సవములు జరిపించిరి; దేవతారాధనములు గావించిరి. ప్రతిష్ఠానపురము నాక్రమించుకొన్న రాజును, భరతఖండమునఁగల ఏఁబదియాఱుదేశముల నేలు రాజులును వచ్చి పురూరవుని పాదపద్మములకు నమస్కరించి, యాతని యాధిపత్యము నంగీకరించి కప్పములు చెల్లించిరి. నవకోటినారాయణసెట్టి

తన తప్పిదమును మన్నింపఁ బ్రార్థింపఁగా రాజు ప్రసన్నచిత్తుఁడై వానిని మన్నించెను. ఆ వెనుకఁ దనకొడుకుల నత్యంతగారాబముతోఁ బెంచి, పెద్దవారింజేసి, విద్యాబుద్ధులు చెప్పించిన గొల్లదానిని బిలిపించి గారవించి యామె నంతఃపురమునందే యుండ నియమించెను. ఈవిధముగా పురూరవసార్వభౌముం డాపత్సమయంబునఁ దనకుఁ జేదోడు వాఁదోడుగా మెలంగినవారినెల్ల రప్పించి యుచితవిధిని సత్కరించెను. తదుపరి జనానురంజకముగాఁ బెక్కు సంవత్సరములు భరతవర్షము నెల్ల నేకహేలగాఁ బాలించి దశదిశలునిండిన సద్యశంబార్జించి, యంతమున వృద్ధాప్య మొదవుటతోనే రెండు రాజ్యముల సిద్దలు సుతులకుఁ బట్టముగట్టి, భార్యాద్వయముతోఁ దపోవనంబున కరిగెను. అతఁడు రాజర్షియై పరమశివునిగూర్చి బహుకాలము తపంబొనరించిఁ తదను గ్రహమునకుఁ బాత్రుఁడై యనేకములగు వరములంబడసెను.

## —♦ ఉపసంహారము. ♦—

పురూరవుండు తొలుతఁ దానూర్వశీ వ్యామోహముంబున సరస్వతీ తీర్థంబున నేర్పఱిచిన యగ్నిస్థానమునొద్దకు వచ్చిచూడఁగా నచ్చట నొక దివ్యవృక్షములోచన గోచరమయినది. దానిని జూచి యాతఁ డాశ్చర్యమునొందెను. అద్దాని కొమ్మలు విఱిచి కవ్వముగా నొనరించి వేదమంత్రోచ్చారణ మొనరించుచుఁ జిలుకఁగా త్రేతాగ్ను లుదయించినవి. మఱియు నూర్వశిని హృదయమునందు ధ్యానింపఁగా నామెకును, అమ్మహీజానికిని ఒక కుమారుఁ డుదయించెను. అతఁడు పురూరవ సార్వభౌమునకు సద్గతులు గలిగించెను. పురూరవుండు వేదోక్తప్రకారంబున వీతిహోత్రుని ప్రీత్యర్థ మనేక యాగము లొన రించి కడపటభార్యలతోఁగూడ స్వర్గముంజేరి యటఁ దన ప్రియురాలగు నూర్వశితోడి నిత్యసాంగత్య సౌఖ్యము ననుభవించెను. ఓ ధర్మ

నందనా ! ఈపురూరవుండు తొలుత నెన్నికష్టము లనుభవించినను, దుదకు ధర్మనిరతుఁడగుటచేతనేకదా సుఖము లందఁగలిగెను ! ఇటులనే సహోదరులతో నేఁడు నీవు కష్టము లనుభవించుచున్నను, అచిరకాలములోనే సమస్త శుభము లందఁగలవు. నీతమ్ముఁడగు నర్జునుఁ డింద్రలోకమునుండి త్వరలోనే రాఁగలఁడు. నీవు శత్రువులను దునుమాడి విజయలక్ష్మిని బొందఁగలవు. ఇఁక నేఁ బోయివచ్చెదను. “ అని వేదవ్యాసుఁడు ధర్మజాదులను వీడ్కొని నిష్క్రమించెను. అతి పవిత్రంబగు పురూరవ చరిత్రము నాలకించి ధర్మజాదులు విచారం బుడిగి ధైర్యము నవలంబించియుండిరి. ” అని వైశంపాయనుండు జనమేజయునకుఁ జెప్పెను.

సంపూర్ణము.



రాజమండ్రి : శ్రీ సత్యానందప్రెస్‌నందు ముద్రింపఁబడినది—19

# నవలలు.

| | రు | అ | | రు | అ |
|---|---|---|---|---|---|
| పంజాబుమెయిలు | 0 | 12 | వ్యామోహము | 1 | 0 |
| విషహృదయము | 1 | 0 | ఫ్లవర్‌గరల్-పువ్వులపిల్ల | 0 | 12 |
| రమాసుందరి 1 వ భా॥ | 0 | 12 | అల్లరిపిల్ల | 0 | 12 |
| 2 వ భా॥ | 0 | 12 | రివాల్వరు | 0 | 12 |
| నీవేనా ? | 0 | 12 | శకుంతల బి. ఏ. | 0 | 12 |
| టోపీదాసు | 0 | 6 | చదువుకొన్న భార్య | 0 | 12 |
| శక్తికుమారి | 0 | 12 | అల్లూరి సీతారామరాజు | 0 | 6 |
| రక్తవాహిని | 0 | 12 | లోకాభిరామాయణం | 0 | 6 |
| యింద్రజాలము | 0 | 12 | దొంగలనాయకుడు | 0 | 12 |
| రాజద్రోహి | 0 | 12 | పోటింతాయి | 0 | 12 |
| వలపులరాణి | 0 | 12 | ఘోరహంతకుడు | 1 | 0 |
| అర్ధరాత్రపువింతలు | | | కన్నపుదొంగ | 0 | 12 |
| 3 హత్యలు | 0 | 12 | మోహపిశాచము 1 భా॥ | 0 | 12 |
| అఘోరి | 0 | 12 | ,, 2 భా॥ | 0 | 12 |
| అగ్గిరాముడు | 0 | 12 | ప్రతాపసింహ 300 పే॥గ్లేజు | 1 | 8 |
| నేనెవరిభార్యను ? | 1 | 0 | బాకుపోటు | 0 | 12 |
| నేనెవరిభర్తను ? | 1 | 0 | మగడుకానిమగడు | 0 | 12 |
| బలేపెండ్లి | 0 | 12 | రాజరత్నం | 0 | 12 |
| సాహసికుడు | 0 | 12 | పగటిచుక్క 1 వ భా॥ | 0 | 12 |
| భయంకరుడు | 0 | 12 | ,, 2 వ భా॥ | 0 | 12 |
| నగేంద్రుడు | 0 | 12 | కాలసర్పం 1 వ భా॥ | 0 | 12 |
| ఏకోదరులు | 0 | 8 | ,, 2 వ భా॥ | 0 | 12 |
| ప్రతిబింబములు | 1 | 0 | 13 వ నెంబరు గది | 0 | 12 |
| ఆనందభవనము | 0 | 12 | వజ్రహారము | 0 | 12 |

కొండపల్లి వీరవెంకయ్య, శ్రీ సత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి.